# చందమామ



పిల్లల కథల మాసపత్రిక



95



Chandamama, June '51

Photo by A. L. Syed

అందానికి మేము, రాగానికి మా చెల్లెళ్లు

# కొందరు తల్లులకు ఇది తెలియదు!

నిజం, నీకు హాయిగా లేదు—వేడిగానుండి ఒళ్లంతా చిరచిరలాడుతూ దురదగానున్నదా—లేక నీ ఒంటిమీది గుడ్డ నీకు బాధ కలిగిస్తున్నదా? పాపం ఏడవక నీవేమి చేయగలవు!

నాకు మాత్రం యిలా కాలేదు. అదృష్టవశాత్తు మా అమ్మకు జాన్సన్స్ బేబీ పౌడరు సంగతి తెలుసు! ప్రపంచంలోకెల్ల అత్యంత మృదువైన చర్మముల కోసం యిది చేయబడినదని ఆమె చెబుతుంది. అందుచే నేను స్నానం చేసిన తరువాత, గుడ్డలు మార్చినప్పుడల్లా ఆమె దానిని నాకు రాస్తుంది. అప్పుడు నాకు ఎంతో ఉల్లాసంగా ఉంటుంది!

మీ అమ్మకు కూడా దీనిని ఎవ్వరూ ఎందుకు చెప్పరు!



అమ్మా!




తనకు హాయిగా లేదని నీ బిడ్డ నీకు చెప్పలేదు. కాని తరచుగా ఏడవగలదు మాత్రమే. జాన్సన్స్ బేబీ పౌడరులోగల ప్రత్యేక దినుసులు మృదువైన చర్మములకు ఉపశాంతి నిచ్చును—అందుచే చాలామంది తల్లులు (మరియు తండ్రులూ!) తమకు కూడా దీనిని వాడుచున్నారు.

నేడే ఒక టిన్ను కొనుడు.— పాపాయికి మీకూ!

పాపాయికి అత్యుత్తమము—మీకూ అత్యుత్తమము.

**Johnson's BABY POWDER**

Regd. Trade Mark

## జాన్సన్స్ బేబీ పౌడరు

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: ఐ.సి.ఐ. (ఇండియా) లిమిటెడ్.

ఆరోగ్యానికీ, రుచికరానికీ



పూజలకు, వివాహాలకు




గడియారం మార్కు

కర్పూరము

ఉపయోగించండి

గోపాల్జీ చాంపషీ & కో.
నెం, గోవిందప్ప నాయక్ వీధి, మద్రాస్




పిల్లల అనారోగ్యములకు

జె. & జె. డిక్షేన్,

రెసిడెన్సీ రోడ్,

హైదరాబాద్, (దక్కన్)








**J.&J. DeChane**

RESIDENCY ROAD, HYDERABAD-Dn.

త్వరలో

ఆనాడు నీతోడుగా పెండ్లియాడి
ఈనాడు, తెగనాడి, నీపాలుచేయ
తాళిగట్టినవాడు తలపెట్టినాడు
ఈ పరాభవము నీవే అగ్నిదేవుడా..





# స్త్రీ సాహసము

దర్శకత్వము
వేదాంతం రాఘవయ్య
రచన, పర్యవేక్షణ......సముద్రాల ** సంగీతం......సుబ్బరామన్



ఛాయాగ్రహణం......రంగా ** కళ......వాలి & గొడగాంకర్...

ఆంధ్ర, సీడెడ్, నైజాం: పూర్ణా రిలీజు | మైసూర్ : అమృత పిక్చర్స్




ఆంధ్ర & సీడెడ్ : నవయుగ ఫిలిమ్సు, విజయవాడ

మైసూరు : ప్రకాష్ పిక్చర్సు, బెంగుళూరు సిటీ :: నైజాం : కర్నాటక ఫిలిమ్సు లి., బెంగుళూరు సిటీ

ఇతర వివరాలకు :

ప్రకాష్ ప్రొడక్షన్సు :: శాంథోమ్ :: మద్రాసు-4

ఆంధ్ర, రాయలసీమ,
నైజాం, మైసూరు, తమిళ
నాడులలో దిగ్విజయముగా
ప్రదర్శింపబడుచున్న

విజయవారి...

# పాతాళభైరవి

డైరెక్షన్
**K.V. రెడ్డి, Bsc (HONS)**





*Produced by* - **NAGI REDDI-CHAKRAPANI**

సంపుటి 8
సంచిక 6

జూన్
1951

# చందమామ

సంచాలకుడు: చక్రపాణి



మానవుడు ఎప్పుడూ మార్పు కోరుతూవుంటాడు. ఏమీ అంటే మార్పులోనే ఆనందమున్నది. చందమామలో కొన్ని మార్పులు చేస్తే బాగుంటుందని మేమూ అనుకొన్నాము, పాఠకులూ కోరారు. ఈ సంచికతో మన చందమామకు నాలుగేళ్లు నిండి, ఐదవ యేడు రాబోతున్నది. ఈ శుభసమయానికి అనుగుణంగా జూలై నుండి చక్కటి మార్పులు చేసి పాఠకులకు ఆనందం చేకూర్చాలెనని నిశ్చయించాము. కొత్తగా ప్రవేశపెట్టబోయే 'చిట్టికథల పోటీ'ని గురించిన వివరాలు ఈ సంచికలో మరొకచోట చూడవచ్చు. పేరుపొందిన 'పెద్దల చిన్నతనా'లనుగురించి తెలుసుకోటానికి ఎంతో ముచ్చటగా వుంటుంది. వీటిని వచ్చేనెలనుండి చదువుదురుగాని. 'రంగు వెయ్యండి' శీర్షిక ఒక అహ్లాదకరమైన బొమ్మల కథగా వెలువడబోతున్నది, అది ఎలా వుంటుందో ఈ సంచికలోనే గమనించగలరు. ఇవిగాక మరి ఎన్నో ఆకర్షణీయమైన విషయాలుకూడా వుంటై.





# మంచి ఏనుగ

ఒక పేద తల్లి తన పాపను
ఎత్తుకొని వెళ్లింది అడవికి.
కట్టె లేరినగాని నిత్యము
భుక్తి గడవదు పాపమామెకు.

దిట్టమగు ఒక చెట్టు నీడను
పండుకొనబెట్టింది పాపను.
వెళ్లిందితా నించు కెడముగా
కట్టెలేరేందుకై దాపున.

ఇంతలో ఝల్లు మని ఉల్లము
ముచ్చెమట క్రమ్మింది ఆమెకు.
ఎందుకంటే ఒక్క ఏనుగ
వచ్చు చున్నది పాప దాపుకు.

కరిపాదముల క్రింద నలుగుతూ
చిటపటా మన్నాయి ఆకులు.
పాప మేల్కొన్నాడు అదటుగా
విన్నాడు తన తల్లి కేకలు.

అభము శుభమెరుగుడా బాలుడు
ఏనుగను చూచాడు కేరుతూ.
నవ్వి చేయూపాడు రమ్మని
పాల బుగ్గల చొంగ కారుతూ.

రచన :
"బైరాగి"

నోట మాటలు రాని తల్లికి
కాళ్లు చేతులు చల్లబడినవి.
బాలుడిక దక్క డనుకొన్నది
కనులు గట్టిగ మూత బడినవి.

తలచుకొన సాగింది మనసులో
గబగబా ఇష్టదేవతలను
మొక్కుకొన్నది మొక్కు లెన్నియో
రక్షించమన్నాదా శిశువును.

పాదమెత్తింది ఆ ఏనుగ
కిలకిలా మన్నాడు బాలుడు.
తల్లి ప్రార్థన తెలిసినట్లుగా
అంగ అటు వేసింది ఏనుగ.

దాటి పోయిందలా ఏనుగ
చెక్కు చెదరక నిలచి బాలుడు
కేరుతున్నాడింక ముదముతో
జరిగినది తెలుసుకొనజాలడు.

ఎత్తుకొన్నది తల్లి పాపను
హత్తు కొన్నది ఎదను ప్రేమతో.
మెచ్చుకొంటూ ఏన్గతెలివిని
తిరిగి పోయినది తన ఇంటికి.






# దవనం

పూర్వం ఓఢ్రదేశాన్ని సాత్వికుడు అనే రాజు పాలించేవాడు. ఆయన గొప్ప భక్తుడు కూడాను. ఎన్ని రాచకార్యాలు మించిపోతూవున్నా, నిత్యమూ ఆయన మహానివేదన సమయానికి మంత్రి సామంతులతో, ఉద్యోగస్థులతోసహా పాదచారియై జగన్నాథస్వామి ఆలయానికి వెళ్లేవాడు. నివేదనఅయి, తలుపులు తెరవటంతోనే స్వామిని దర్శించుకుని అర్చకులిచ్చే ప్రసాదాన్ని పుచ్చుకుని వెళ్లిపోతూ వుండేవాడు.

ఇలా చాలాకాలం గడచింది. ఒకనాడు రాజు వచ్చేసరికి, గుడిగోపురంవద్దనే అర్చకులలో ఒకడు ఎదురై, 'ప్రభూ, ఈరోజున స్వామివారి ఆరాధన, మహానైవేద్య నీరాజనాలు ముగియటానికి కొంతసేపు అవుతుంది. ఈలోగా ఏలినవారు ఈ మండపంలో విశ్రమించవచ్చు' అని విన్నవించుకున్నాడు. రాజు 'సరే' నంటూ, ప్రధానినీ ఉద్యోగులనూ, మిత్రులనూ వెంటబెట్టుకొని మండపం ప్రవేశించాడు. ఆవేళకి అక్కడ ఎవరో యాత్రికులు నలుగురు పాచికలు పెట్టి జూదం ఆడుకుంటున్నారు. 'రాజుగారు వస్తున్నారు, మరోచోటికి పొండయ్యా!' అని అర్చకుడు వాళ్లని లేవగొట్టబోయాడు. అదిచూచి రాజు, 'వద్దు వద్దు. వాళ్ళను ఆడుకోనియ్యి' అన్నాడు. వాళ్లు పందేలు వేస్తున్నారు, ఓడుతున్నారు, నెగ్గుతున్నారు. ఓడినవాళ్లు ఏడుస్తున్నారు, నెగ్గినవాళ్లు సంతోషిస్తున్నారు. రాజు ఇదంతా వేడుక చూస్తూ నిలబడిపోయాడు.

కొంతసేపు అలాచూస్తూ నిలబడేసరికి ఆయనకుకూడా ఒక పందెం వెయ్యాలని అనిపించింది. మంత్రిని, సేనాధిపతినీ, పురోహితుణ్ణీకూడా ఆటలోకి దింపి, రాజు పందేలు వేయటం మొదలుపెట్టేడు. కాస్సేపటికల్లా జూదంలో రంజు ఎక్కువై,

పి. లక్ష్మి, కాకినాడ






అయన దేవదర్శనంకోసం వచ్చామన్న మాటే మరిచిపోయాడు. అవతల మహానివేదన పూర్తిఐంది. గర్భగుడి తలుపులు తెరిచారు. 'ప్రభువువారువచ్చి స్వామి దర్శనం చేసుకోవచ్చు' నని కబురుపై కబురు వచ్చింది. కాని మహానందంలో మునిగి తేలుతూవున్న మహారాజావారికి ఆ పిలుపు వినిపించనేలేదు.

దేవుడి ప్రసాదం ముందుగా ప్రభువుకి యిచ్చి, తర్వాత తక్కినభక్తులకు ఇవ్వటం మామూలు. రాజుగారు ఎంతకూ లేవక పోవటం, భక్తులంతా కనిపెట్టుకొని ఉండటంచూసి అర్చకులు మండపంవద్దకే ప్రసాదం పట్టుకువచ్చి, 'ప్రభూ, భగవత్ప్రసాదం!' అన్నారు. ఆటమజాలో ఉన్న ప్రభువు కుడిచేత్తో పాచికలు విసురుతూ, అర్చకులవైపు తిరక్కుండానే, యెడం చెయ్యి చాపేడు. ఎడంచేతిలో ప్రసాదం ఉంచటం దేముడికి అపచారంచేసినట్టు అవుతుందన్న భయంకొద్దీ అర్చకులు, రాజుకు ప్రసాదం ఇవ్వకనే వెళ్లిపోయారు.

మరో గంటసేపు ఆడేసరికి జూదంమీద రక్తితగ్గి రాజుగారికి తానువచ్చిన పని జ్ఞప్తికొచ్చింది. 'ఏమయ్యా, ఇంకా మహానివేదన కానేలేదా? తలుపులు తియ్యలేదా?' అని అడిగేడు. జరిగినసంగతంతా చెప్పేరు అక్కడివాళ్లు. రాజుగారికి కలలోనుంచి మెలకువ వచ్చినట్టయింది. 'అయ్యో, ఎంతపాపంచేశాను! పరమ పవిత్రమైనటువంటిన్నీ, మోక్షప్రదమైనటువంటిన్నీ భగవత్ప్రసాదంకోసం వచ్చి, క్షుద్రమైన జూదంలో తగులుకొన్నానే! సోమరసాన్ని ఉపేక్షించి, సురాపానం అపేక్షించినట్లు అయింది నాపని! ఎంత పాపంచేశాను!' అని గుండె బాదుకుని దుఃఖించటం మొదలెట్టేడు. అయననుచూచి అంతా నివ్వెరపోయారు. చనవుగల మంత్రి రాజువద్దకు







వెళ్లి, 'ప్రభూ! మనస్వామి దయాళువు, ఈ చిన్న అపరాధానికి క్షమించకపోడు. రండి దర్శనం చేసుకు మరీ వెడదాం' అని ప్రోత్సహించి స్వామిసన్నిధికి తీసుకు వెళ్లాడు.

స్వామినిదర్శించి రాజు ప్రసాదంపుచ్చుకుని వెళ్లాడేకాని ఆయన మనసు మనసులో లేదు. హృదయంలో ఒక అగ్ని పర్వతం బ్రద్దలైనట్టు అనిపించి, చెప్పలేని బాధ, అవేదన అంతకంతకు ఎక్కువ కాజొచ్చింది. అనాడు తాను గుడిలో జూద మాడిన పాచికలు పాములలాగా మిలమిల్లాడుతూ, కన్నుతెరిచినా మూసినా భయంకరంగా ప్రత్యక్షమవుతున్నై. తను చేసిన మహాపరాధం మరపునకురాక, గుండెమీద సుత్తిదెబ్బల్లాగ కొడుతున్నై.

ఇక—అనాడు జూదపుఆటలో మునిగి వుండి, ప్రసాదాన్ని తెచ్చి పుచ్చుకోమన్నప్పుడు అప్రయత్నంగా ఎడమచేతిని చాపిన సంగతి జ్ఞాపకంరాగా, రాజుకు తను చేసిన పని తనకే రోత అనిపించింది. 'స్వామిపట్ల ఇంతటి మహా అపచారాన్ని తలచిన ఈ యెడమచేతిని నరికిపారవేయడమే తగిన ప్రాయశ్చిత్తం' అని నిశ్చయించుకొన్నాడు. ఐతే, తనకు తానై ఈ పనిచేసుకోవటం అసాధ్యంకద! కనుక, ఇందుకొక చిన్న సూత్రం పన్నాడు ప్రభువు.

ఒకనాటిరాత్రి మంత్రిని పడకగదికి రప్పించి, 'మంత్రీ, ఈమధ్య కొన్నాళ్ళనుంచి అర్ధరాత్రివేళ భూతమేదో వచ్చి కిటికీలోంచి చెయ్యిదూర్చి నన్నులేపి, బాధిస్తోంది. కనుక దానిపీడ వదిలించుకోవాలి. ఈరాత్రి నేను ప్రక్కగదిలో పరుంటాను. నువ్వు ఇక్కడ మెలకువగా కాచుకుని ఉండి, ఆ భూతంవచ్చి కిటికీలోంచి చెయ్యి పెట్టటంతోనే నీ కత్తితో ఆ చెయ్యిని నరికి వేసెయ్యి' అనిచెప్పి, పక్కగదిలోకి వెళ్ళి

2292

పోయాడు. భూతంమాట నిజమే అనుకొని మంత్రి ఒరలోంచి కత్తితీసి పట్టుకొని కాచుక్కూచున్నాడు. ఒకరాత్రివేళ కిటికీలోంచి లోపలికి ఒక చెయ్యి రాబోవటం కనిపెట్టి, సిద్ధంగావున్న మంత్రి ఆ హస్తాన్ని లిప్తలో ఖండించివేశాడు.

అతడు నరికిన చెయ్యి గదిలోపడింది. ఆ భూతం ఏమిటోఅని మంత్రి కిటికిలోంచి తొంగిచూశాడు. భూతమూ లేదు, ఏమీ లేదు. రెక్క తెగిపడ్డ జటాయువుకుమల్లే కూలపడిన రాజేంద్రుడే కంటపడ్డాడు! మంత్రి పరుగెత్తుకొంటూ వెళ్లి 'ప్రభూ! ఇదేమిటి? నాచేత ఇటువంటి మహాపరాధం చేయించారెందుకు?' అంటూ నెత్తీ నోరూ బాదుకున్నాడు. రాజు తనబాధ పైకితెలియనీయక చిరునవ్వుతో, 'అపరాధం కాదోయి, ఉపకారమే చేశావు! ఆ జగన్నాథస్వామే నీరూపంలో నాకీ ప్రాయశ్చిత్తం సిద్ధింపజేశాడు!' అంటూ జగన్నాథుణ్ణి స్తోత్రం చెయ్యటం ప్రారంభించాడు. మంత్రి పిచ్చెత్తినవాడికిమల్లే 'దుర్మార్గుణ్ణి! ద్రోహిని! రాజహంతకుణ్ణి!' అంటూ కేకలువేయటం ఆరంభించేసరికి అందరూ లేచి పరుగెత్తుకు వచ్చి చుట్టూమూగేరు.



చిరునవ్వుతోనే రాజు జరిగినదంతా చెప్పేడు. గదిలో తెగిపడిఉన్న ప్రభువువారి యెడమచేతిని ఒక ముత్యాలపల్లకీలో పెట్టించి భజంత్రీ మేళాలతో ఊరేగించారు. తెల్లవారేసరికి జగన్నాథస్వామి ఆలయ గోపురంవద్దకు అందరితోపాటు రాజూ చేరుకున్నాడు. 'గుడిలోపలికి దయచెయ్యండి' అని అందరూకోరారు. ఎవరుచెప్పినావినక, రాజు 'స్వామికి అపచారంచేసిన నాకు ఇంక ఆలయంలో ప్రవేశించే అర్హత లేదు. నా అపరాధానికి తగ్గ ప్రాయశ్చిత్తమని తోచి, ఈ చెయ్యిని ఖండించుకున్నాను. ఈ పల్లకీ తీసికెళ్లి స్వామిముందుపెట్టి, నాకు

ఆయన ఇంకా ఏంశిక్ష విధిస్తారో కనుక్కు వచ్చి చెప్పండి' అన్నాడు.

రాజాజ్ఞను శిరసావహించి పల్లకిని లోపలికి తీసుకువెళ్లి, అర్చకులు మామూలు ప్రకారం మహానివేదనా, నీరాజనం అవీ జరిపేరు. స్వామిప్రసాదం రాజుగారికి తెచ్చియిచ్చారు. సాత్వికమహారాజు అలవాటుప్రకారం కుడిచేతితోపాటు, ఎడంపక్క వ్రేలాడుతున్న మొండిచెయ్యికూడా చాచి దోసిలి పట్టబోయాడు. అందరూ ఆ మొండిచెయ్యి చూసి, 'పాపం!' అని నిట్టూర్పువిడుస్తో సానుభూతి కనపరిచారు. కాని, వాళ్లు చూస్తోండగానే, మొండిగా ఉన్న ఆ ఎడంచెయ్యి ఇట్టే మొలుచుకువచ్చి, దేవుడిప్రసాదాన్ని పుచ్చుకోటానికి వీలయేటట్లుగా రాజుకి దోసిలి ఏర్పడింది. అక్కడ మూగిన భక్తులూ, సాధులూ అంతా హర్షధ్వనులుచేసి, "మహారాజా, ఇంకా 'శిక్ష, శిక్ష' అంటారేమిటి? భగవంతుడు తమరిని ఎలా అనుగ్రహించాడో చూడండి!" అని మెచ్చుకున్నారు.

అర్చకులు మళ్లీ లోపలికివెళ్లి చూసేటప్పటికి మరోచిత్రంజరిగింది. తెగిపోయిన పాతచెయ్యి పల్లకీలో ఉన్నదికదా! అది మాంసంతో ఎముకలతో కూడినదిగనుక దుర్గంధం కొడుతూ ఉండవలసింది, కాని వింత!—ఆ చెయ్యి మాంచి సువాసన విరజిమ్మే ఒక మొక్కగా మారిపోయింది!! అందరూ ఆ మొక్కని స్వామివారి నందనవనంలో పాతించారు.

ఆతర్వాత మరికొద్దికాలానికే దాని విత్తనాలుపడి వనమంతా ఆ మొక్కలమయమైంది. దశదిశలనుంచీ వచ్చిపోయే భక్తులంతా ఆ మొక్కలు పట్టుకుపోయి తమ గ్రామాల్లో పాతుకున్నారు. అవే మన దవనం మొక్కలు. జగన్నాథస్వామివారికి పూజించే పరికరాలలో ఇప్పటికీ దవనం ప్రముఖస్థానం అలంకరిస్తున్నది.






## 12

[శిలాప్రతిమలుగా మారిపోయి రాక్షసుడికి పట్టుబడిపోయిన మన కవలసోదరులు, రాకుమార్తెల యుక్తివల్ల ఎలా మళ్ళీ మామూలు స్వరూపాలు పొందినదీ, ఆ తర్వాత రాక్షసుడిని మోసపుచ్చి ఎలా తప్పించుకువచ్చిందీ క్రిందటినెల చదివారు. ఆతర్వాత]

రాక్షసుడిని మోసంచేసి కవలసోదరులు ఎలాగో బైటపడ్డారేకాని, వాళ్ళకి మన స్తిమితం లేకుండా పోయింది. ఎందుచేత నంటే అదివరకు మోస్తరుగా రాక్షసుడి కంటబడకుండా తమని అదృశ్యం చేసుకో గల భస్మం కాస్తా పోయిందాయె! పోనీ రాకుమార్తెలతోపాటు హంసల రూపంలో కొలనులో ఉందామా అంటే, హంసలలెక్క రాక్షసుడికి తెలియనే తెలుసు. కనుక అదీ ప్రయోజనంలేదు. ఏమి చెయ్యటానికీ పాలుపోలేదు.

ఇలాంటి చిక్కులోపడి కవలసోదరులు క్షణమొక యుగంగా గడపవలసి వచ్చింది.

ఒకరోజున సుభాషిణి అన్నది: 'ఇక మీదట మీరు యిక్కడ వుండటం క్షేమం కాదు. మనం చేసిన మోసానికి రాక్షసుడు కసిపూని వుంటాడు. ఈసారి వాడిచేతిలో చిక్కితేమటుకు ప్రాణాలతో వదలడు. కనుక రేపు వాడు ఆటపాటలకు వచ్చిన సమయంచూచి మీరు ఈ స్థలంవదిలి వెళ్ళి పోండి. మమ్మల్ని రక్షించే సమస్య అంతా వదులుకోండి" అని.

ఇదివిని ఉదయనుడు, "అలా ఎన్నడూ జరగదు. మా ప్రాణాలు ఉన్నంతవరకూ మిమ్మల్ని రక్షించేందుకే ప్రయత్నిస్తాం" అన్నాడు.




"అలా అయితే, ఒక్కటే మార్గం. రేపు వాడు యిక్కడికి వచ్చినప్పుడు మాతో పాటు కొలనులో వుండే తక్కిన రాకుమారులుకూడా కలిసి ఆటపాటలలో పాల్గొనే టట్టు ఏర్పాటు చేస్తాను. ఆ రాకుమారులలో మీరూ చేరిపొండి. సమయం కనిపెట్టి రాక్షసుడి తల తెగవేయండి" అన్నది.

సోదరులు యిందుకు ఒప్పుకున్నారు. మర్నాడు రాక్షసుడు రాకుమార్తెలదగ్గరికి వచ్చినప్పుడు సుభాషిణి, "మగవాడవైన నీవు ఒక్కడివే యింతమంది ఆడవాళ్ల మధ్య ఉండటం బాగుండదు. కొలనులో యింకా రాకుమార్లు వున్నారుకదా? వాళ్లని



కూడా మనతో చేర్చుకొందాం. సందడిగా వుంటుంది. లోకానికి విరుద్ధమనిపించదు" అని సలహాయిచ్చింది.

"ఈపాటిదానికి నన్ను అడగాలా? అలాగే కానివ్వండి" అన్నాడు రాక్షసుడు.

వెంటనే కొలనులోవున్న హంసలన్నీ ఒడ్డుకివచ్చి మానవాకారాలు దాల్చినై. వాటిలో మన కవలసోదరులుకూడా వున్నారుగా! అయితే ఆటపాటల దృష్టిలో వున్న రాక్షసుడు వాళ్లని గమనించనేలేదు.

రాకుమార్తెలు కనుపండువుగా నృత్యం చేస్తున్నారు. రాక్షసుడు ఆనందంలో మునిగి తేలుతున్న సమయం చూశాడు ఉదయుడు. సర్రున కత్తిదూసి ఒక్క వ్రేటున వానితల తెగనరికాడు. వెంటనే రాక్షసుని మొండెం నేలకు ఒరిగిపోయింది. తెగిపోయిన తల వెళ్లి కొలనునీటిలో పడింది. తలనుండి కారుతున్న రక్తప్రవాహంతో కొలను నీరంతా ఎర్రబడిపోయింది.

అదేసమయాన మరొకచిత్రం జరిగింది. రాక్షసుడు ఎప్పుడైతే చచ్చిపోయాడో ఆ తక్షణమే వాడు కాపలాకాస్తున్న భవనం మాయమైపోయింది. కవలసోదరులలాగనే వచ్చి రాక్షసుడి చేతిలో చిక్కిపోయిన

రాకుమారుల శిలాప్రతిమలు మాత్రం ఇంకా అక్కడ మిగిలివున్నై.

అప్పుడు సుహాసిని, "ఇంకాచూస్తారేం! మంత్రజలం తెచ్చి ఆ శిలా ప్రతిమలకు మామూలు స్వరూపాలు తెప్పించండి" అన్నది. అలా చేయగా, ప్రతిమలన్నీ రాకుమారులుగా మారినై. వారిలో అన్ని తరగతుల వయసువారూ వున్నారు.

వారంతా కవలసోదరులనూ, మన రాకుమార్తెలనూ ఎంతగానో మెచ్చుకున్నారు. తలవనితలంపుగా తమకు యిలా తిరిగి మామూలు స్వరూపాలు వచ్చినందుకు వారు ఎంతో ఉప్పొంగిపోయారు. అయితే, ఇంత ఆనందంలోనూ అందరికీ కూడా ఒకేవిధమైన చింత పట్టుకున్నది— తిరిగి తమ తమ యిళ్లు చేరుకోవటం మాట అలావుంచి, ఆ ప్రదేశంలో రాక్షసుడి కంట పడకుండా మెలగటం ఎలాగ? అని.

దీనినిగురించే వాళ్లంతా సమావేశమై తీవ్రంగా ఆలోచించారు. కాని ఎవరికీ ఉపాయమేదీ తోచలేదు. చివరకు ఉదయనుడు—'మీరందరూ యిక్కడే వుండిపోవటం క్షేమం కాదు. రాక్షసుడి చేతిలో చిక్కిన ఈ రాకుమార్తెలనందరినీ క్షేమంగా







వారివారి యిళ్లకు చేర్చే బాధ్యత మాది. కనుక మీరు నిశ్చింతగా వెళ్లిపోవచ్చు" అన్నాడు.

కాని యిందుకు ఎవరూ ఒప్పుకోలేదు. వారిలో ఒక వృద్ధుడు—"అబ్బాయీ! మేము తిరిగి యిళ్లకు చేరుకోవటం మాత్రం మాటలా? గెడ్డపువాడిని తప్పించుకుపోవటం అసాధ్యం. కనుక మనం చెయ్యగలిగినదల్లా ఒక్కటే. మమ్మల్ని తిరిగి శిలాప్రతిమలుగా మార్చివేసెయ్" అన్నాడు.

ఇందుకు కవలసోదరులు ఒప్పుకొనక తప్పిందికాదు. వాళ్ల కోరికప్రకారం మళ్లీ శిలాప్రతిమలుగా చేసివేశారు.

ఇక తమసంగతి ఏమిటా అని ఆలోచిస్తున్నంతలో రాక్షసుడు వచ్చేశాడు. ఈసారి వాడు వట్టిచేతులతో రాలేదు. ఒక రాకుమార్తెను వెంట తీసుకువచ్చాడు. దగ్గరకు వస్తున్న అలికిడి ఐంది. ఇంక ఆ తొందరలో కవలసోదరులు ఏంచేస్తారు! గభీమని కొలనులోదూకి హంసలుగా మారిపోయారు.

మరుక్షణమే రాక్షసుడు కొలను చేరుకున్నాడు. తను తెచ్చిన ఆ రాకుమార్తెను కూడా కొలనులోకి విసిరి వేశాడు. ఆమె కూడా హంసగా మారిపోయింది.

ఇలా రాకుమార్తెను కొలనులో విసిరి వేసినవెంటనే రాక్షసుడు మళ్లీ ఒకసారి ఆ హంసలను లెక్కపెట్టసాగాడు. ఇంత కాలమూ కొలనులో వున్నది నలభై ఏడుగురేననీ, తన వ్రతం పూర్తి కావటానికి మరి ముగ్గురు తక్కువైనారనీ అనుకుంటూ వున్నాడు. ఆ రోజు తను తెచ్చిన రాకుమార్తెతో నలభై ఎనిమిదిమంది కదా కావాలి? కాని లెక్కపెట్టగా యాభై ఒక్కమంది వుండటం చూచి, వాడు సంతోషంతో ఎగిరి గంతువేశాడు. మరుక్షణమే వాడికొక సందేహం కలిగింది. హంసల నన్నిటినీ ఒడ్డుకి రప్పించాడు. అవి నీటిలోంచి బైటికి

2297

అనగానే రాక్షసుడు "మీలో కొత్తగా వచ్చిన ముగ్గురూ ఎవరు?" అని గద్దించిఅడిగాడు.

కవలసోదరులు ముగ్గురూ ముందుకు వచ్చి—"మేమేను. అమాయికులైన ఈ రాకుమార్తెలను ఎందుకిలా బంధించి వుంచుతావు! ఇప్పటికైనా మించిపోలేదు. వీళ్లని వదిలిపెట్టు. లేదా నీ తమ్ముడిగతి ఏమైందో నీకూ అదే కాబోతుంది" అని బెదిరించారు.

"ఆఁ, ఏమిటీ? నా తమ్ముడిగతా! ఏమైనాడు వాడు?" అని పెద్దగా బొబ్బలు పెట్టాడు.

"ఏమిటవుతాడు. మట్టిలో కలిసిపోయాడు. వాడితోపాటు నీ మాయాభవనమున్నూ..." అని కవలసోదరులు అంటూ వుండగానే రాక్షసుడు అక్కడ నిలవక ఒక్క పరుగున తన తమ్ముడు కాపలా కాస్తున్న భవనంవైపుకి పరుగెత్తాడు. చూస్తే ఏముంది? శిలాప్రతిమలు తప్ప మరేమీ కానరాలేదు.

కళ్లవెంట చింతనిప్పులు కక్కుతూ రాక్షసుడు తిరిగివచ్చాడు. ఈలోగానే కవలసోదరులు తోటలోకివెళ్లి మామిడికాయలు కోసి తిని కోతులలాగా మారిపోయారు.




రాక్షసుడికి అందకుండా ఆ కోతులు ఒక చెట్టుమీదినుంచి మరొక చెట్టుమీదికి దూకుతూ ముప్పతిప్పలు పెట్టసాగినై.

చివరకు ప్రాణం విసిగి రాక్షసుడు—"కానివ్వండి. ఇలా ఎంతకాలం తప్పించుకు తిరుగుతారో నేనూ చూస్తాను" అంటూ మళ్లీ గద్దరూపంలో రివ్వున ఆకాశమార్గాన ఎగిరిపోయాడు.

మరికొద్దిసేపటికల్లా కోతులరూపంలో కవలసోదరులు తిరుగుతున్న చోటికి గెడ్డపువాడు వచ్చి ప్రత్యక్షమయాడు.

కోతులను చూస్తూనే వాడు, "మంచి శాస్తి జరిగింది. లేకపోతే అంత కొవ్వా?



ఇంకా నయం, మిమ్మల్ని ప్రాణాలతో వదిలాడు" అన్నాడు.

యిలా అంటూవున్నంతలో ఒక కోతి వచ్చి అమాంతం వాడి నెత్తిమీద దూకింది. గెడ్డపువాడు తల పైకి ఎత్తి చూచేటంతలో మరొక కోతి వాడి గెడ్డం లంకించుకుని బరబర ఈడ్చుకుపోసాగింది. బరువైన మూడో కోతి వాడి కాళ్లుపట్టుకు వేళ్లాడసాగింది. గెడ్డపువాడు లబోదిబోమని మొత్తుకున్నాడు. కోతులు వాడిని వదలలేదు. గెడ్డం లంకించుకున్న కోతి, వాడిని ఒక చెట్టుపైకి లాక్కుపోయి వాడి గడ్డాన్ని ఆ చెట్టుకొమ్మకు వ్రేలాడగట్టి గట్టిగా ముడివేసింది. ఆ వెంటనే, చెట్టుక్రింద మొలిచివున్న కుక్కగొడుగులు తినేసరికి కవల సోదరులకు కోతిరూపాలు పోయి మామూలు స్వరూపాలు వచ్చినై.

వాళ్లని చూచి గెడ్డపువాడు "ఇక్కడి చెట్లూ చేమలూ వాటిమర్మాలూ మీకు బాగా తెలిసినట్టున్నదే? ఎరక్కపోయి మీదగ్గరికి వచ్చాను. యింతటితోనైనా నన్ను విడిచిపెట్టండి బాబూ" అంటూ మొరపెట్టుకున్నాడు.

"ఈసారి నిన్ను అంతంతమాత్రానికి వదిలేదిలేదయ్యా. ఇదుగో, ఇకమీదినుంచి నువ్వు రాక్షసుడి సేవకుడివి కావు. మా సేవకుడివి. కనుక మేము చెప్పినట్టల్లా చేయాలి. నీ మాయదండ ముందు మాకిప్పుడు యిచ్చివెయ్యి. రాక్షసుడినిగురించిన రహస్యాలు పూర్తిగా వెల్లడించు. ఇందుకు ఒప్పుకుంటె నిన్ను విడుదల చేస్తాం. లేదా యిలాగ వేలాడుతూ వుండవలసిందే" అన్నాడు ఉదయనుడు శాసించినట్టుగా.

అందుకు గెడ్డపువాడు—'చాలా పెద్ద షరతులే పెట్టారే. మీ సేవకుడిగా ఉండటానికి నాకేమి అభ్యంతరంలేదు. మాయ

దండకూడా మీవశం చేస్తా. కాని, రాక్షసు నిగురించిన రహస్యాలుమాత్రం అడగ కండి. అవి వెల్లడించినట్టయితే నేను తల పగిలి చస్తానని యిదివరకే మీకు చెప్పా నుగా? ఆ రహస్యం మీకు చెప్పి నేను చని పోవటమా? లేక మీ సేవకుడుగానేవుండి శాయుశక్తులా మీకు సహాయం చేస్తూవుండ టమా? అని ప్రశ్న. ఐనా, పట్టుదలతో ప్రయత్నిస్తే రాక్షసుడి రహస్యం తెలుసుకో లేకపోరు మీరు" అని మెడలోవున్న దండ తీసి యిచ్చాడు. దానిని అందుకుని ఉద యనుడు తన మెడలో వేసుకున్నాడు. గెడ్డపువాడికి మానవ స్వరూపం వచ్చింది; ఉదయనుడికి గెడ్డపువాడి స్వరూపం వచ్చింది. దానితోపాటు ఉదయనుడికి అంజనాలూ, భస్మాలూ, తువ్వాలూకూడా లభించినై.



వెంటనే ఉదయనుడు కొలనువద్దకు వెళ్లి అందులో హంసలుగావున్న రాకుమార్తె లనూ వాళ్లనూ బైటికి రమ్మన్నాడు. వాళ్లు బైటికి వచ్చాక అంతా బారులు తీర్చి కూచున్నారు. మాయతువ్వాలు మహిమవల్ల అందరకూ బ్రహ్మాండమైన విందు చేశాడు. తర్వాత శిలాప్రతిమలుగా మారివున్న వాళ్లకి మామూలు స్వరూపాలు తెప్పించి వాళ్లకికూడా విందు చేశాడు.

విందు అయాక ఉదయనుడు గెడ్డపు వాడితో "వీళ్ల నందర్నీ తీసుకువెళ్లి వాళ్ల వాళ్ల యిళ్లదగ్గిర వదిలిరా" అన్నాడు.

అందుకు గెడ్డపువాడు—'ఇది చాలా కష్టమైన పని. రాక్షసుడి కంట బడ్డామంటే ప్రాణాలు దక్కవు. కనుక మరికొంత కాలం శిలాప్రతిమలనూ, హంసలనూ ఇక్కడనే ఉండనివ్వండి. సమయంచూచి వాళ్లని యిళ్లకు చేరుస్తా" అన్నాడు.

ఇందుకు కవలసోదరులు ఒప్పుకోగా, వాళ్ళని మళ్ళీ శిలాప్రతిమలుగానూ,

హంసలుగానూ మార్చి ఎవళ్ళ చోటుల్లో వాళ్ళను వుంచాడు.

ఇంతలో రాక్షసుడు వచ్చేశాడు. వాడు వస్తున్న సంగతి గ్రహించి గెడ్డపువాడి ఆకారంలోవున్న ఉదయనుడు తన దగ్గిరవున్న భస్మంతీసి, తన సోదరులపైనా గెడ్డపువాడిపైనా చల్లాడు. రాక్షసుడు సరీగా అక్కడికి వచ్చి చేరుకునేసరికి గెడ్డపువాడి వేషంలో ఉదయనుడుమాత్రం నిలిచి వున్నాడు. వాడు తన సేవకుడైన గెడ్డపువాడేననుకుని రాక్షసుడు—"ఆ కోతిమూక ఏమైంది?" అన్నాడు.

"ఏమవుతారు. ముగ్గుర్నీ పీకనులిమి చంపేశాను" అన్నాడు ఉదయనుడు.

"ఏరీ, ఎక్కడ వాళ్లు?" అని ఆత్రంతో ప్రశ్నించాడు రాక్షసుడు.

"చూపుతాను రా" అంటూ రాక్షసుడిని ఒక పాడు బావిదగ్గరికి వెంటబెట్టుకు వెళ్లి, తొంగిచూడమన్నాడు ఉదయనుడు.

ఆత్రంకొద్దీ రాక్షసుడు బావిలోకి తొంగి చూడబోయాడు. అంతకుముందుగానే ఉదయనుడు ఆ బావి ఒడ్డున తన కత్తి దాచివుంచాడు. ఎప్పుడైతే రాక్షసుడు తొంగి చూడబోయాడో సర్రున కత్తిదూసి ఒక్క వేటు వేశాడు ఉదయనుడు. తల తెగి బావిలో పడింది కాని, చిత్రమేమిటో, రాక్షసుడికి మరొక తల మొలుచుకువచ్చింది.

రాక్షసుడు గిరుక్కున తిరిగి గెడ్డపువాడి వేషంలోవున్న ఉదయనుడిని గుప్పిటిలో పట్టి, "ఎంత ద్రోహం తలపెట్టావురా! నా ఉప్పు తింటూ, నాకే ముప్పు తలపెట్టావా" అంటూ వానిని బావిలో విసిరివేశాడు.

---

[ఇలా బావిలో పడిపోయిన ఉదయనుడి గతి ఏమిటి? ఇంతకూ ఉదయనుడి మాయవేషం రాక్షసుడు తెలుసుకోగలుగుతాడా? భస్మంవల్ల మాయం చేయబడిన కవలసోదరులగతీ, గెడ్డపువాడి సంగతీ యేమవుతుంది? ఈ చిత్రాలన్నీ వచ్చేనెల]

2300






సామంతకుళ్లు అనే గ్రామంలో సరమ్మ అనే ఆమె ఉండేది. ఆవిడకి పాపం భర్త చిన్నప్పుడే పోయాడు. అందుచేత ఆమె ఒంటరిగా జీవితం గడుపుకోవలసి వచ్చింది. పోతే—ఆమెకు భర్త విడిచిపోయిన ఆస్తి అంతా ఒక చిన్న ఇల్లూ, దానివెనకాల కాస్త పెరడూను. ఆ పెరట్లో మొక్కా మోదుగా వేసుకుని, దానిమీద వచ్చే ఆదాయంతో ఆమె ఎలాగో పొట్టపోసుకుంటూ కాలం వెళ్లబుచ్చేది.

ఇలా ఉండగా, ఆవిడకు వేలువిడిచిన మేనమామ కుమార్తె కూతురికి పెళ్లి అనీ, పదిరోజులు ముందుగానే వచ్చి పెళ్లిపనులలో కాస్త సాయంచేసి పెట్టవలసిందనీ కొమరగిరినుంచి ఆ మేనమామ కుమార్తె భర్తవద్దనుంచి ఎన్నడూ లేని అపేక్షతో జాబు వచ్చింది. సరమ్మగారు ఆ జాబు చూసుకున్నవెంటనే ఇల్లు తాళం వేసుకుని ఇరుగుపొరుగమ్మలతో 'కాస్త ఇల్లు చూస్తోంటండి మళ్లీ నాలుగురోజుల్లో తిరిగి వచ్చేస్తాను' అని వప్పగింతలు చెప్పి, హడావుడిగా పుట్టినింటికి వెడుతూన్నంత సంబరంతో బయల్దేరి, కొమరగిరి చేరుకుంది. సరమ్మ వెళ్లీవెళ్లడంతోనే పుట్టెడు చాకిరీ పైనపడింది.

పెళ్లి ఐదురోజులూ పెళ్లుమంటూ వైభవంగా జరిగిపోయింది. సరమ్మగారు వచ్చిన పనికూడా అయినట్టేగా? అందుకని ఆవిడ కొంగున కట్టుకునివున్న నాలుగు రూపాయిలూ పెళ్లికూతురు చేతులోపెట్టి, దీవించి 'వస్తానర్రా' అని అక్కడ అందరితోటీ చెప్పి, బయల్దేరి స్వగ్రామం చేరుకుంది.

ఇంటికివచ్చి, తీరా తలుపు తాళంతీసుకుని పెరట్లోకి వెళ్లి చూసుకునేసరికి సరమ్మకు గుండె నీరైంది! ఏమీ?—ఇంటికి ముప్పై గజాల దూరంలో ఉండే కట్టవ

పి. వెంకమాంబ, మాంబళం



2302

'అయ్యో చూస్తో ఊరుకున్నారా?' అంది సరమ్మ.

'ఏం చెయ్యమన్నారు సరమ్మగారూ, ఊరుకోక ? మునసబు గ్రామాని కంతకీ బలవంతుడు! ఎవరన్నా ఆయనకి ఎదురు చెప్పగలరా ?' అన్నారా ఇల్లాళ్లు.

సరమ్మ సరాసరి మునసబు పెళ్ళాం వద్దకు వెళ్లి తనకు జరిగిన అన్యాయం చెప్పుకొని ఏడ్చింది. అధికారి భార్య, 'మగవాళ్ల గొడవల్లో నేను జోక్యం కలుగ చేసుకునేదాన్ని కానమ్మా' అని ఒక్క ముక్కలో జవాబు చెప్పి పంపేసింది. సరమ్మ వెంటనే పోయి కరణంతో మొర పెట్టుకోబోగా 'తెల్లవారిలేస్తే మునసబూ నేనూ మొహమొహాలు చూసుకోవలసిన వాళ్లం. నావల్ల యేమీ కాదు సుమా' అనేసి తప్పించుకున్నాడు.

ఇంక ఊళ్లోవాళ్లెవరూ కలుగచేసుకోరని నిశ్చయం తోచి సరమ్మ బంధువులుండే కొమరగిరికి జాబు రాయించింది. 'ఊళ్లో వాళ్లకే సాధ్యంగాని వ్యవహారం పొరుగూరి వాడికి నాకు సాధ్యం అవుతుందా ? నేను వచ్చి మాత్రం యేం చెయ్యగలను ?' అని, ఆవిడకు వేలువిడిచిన మేనమామ కుమార్తె

ఇరవైగజాలు ముందుకు జరిగివచ్చేసింది! 'ఏమిటిది విడ్డూరం?' అంటూ సరమ్మ గారు ఇరుగమ్మనీ పొరుగమ్మనీ పిలిచి చూపించింది.

'ఏముందమ్మా, నువ్వు ఊళ్లోలేకుండా చూసి, మునసబుగారు మీ పెరడు ఇరవై గజాలమేర తమ పెరట్లో కలిపేసుకున్నాడు. పాత కట్టవ పీకించేసి, ఇరవై గజాలు ముందుకుతోసి కొత్త కట్టవ వేయించాడు. 'రాజు తలిస్తే దెబ్బలకు కొదవా' అన్నట్టు, గ్రామాధికారులు తలుచుకుంటే ఏపని చెయ్యలేరు!' అని జరిగిన సంగతి చెప్పేశారు.

2303

భర్త సమాధానం రాసి ఊరుకున్నాడు. 'తమ అవసరానికి ఎంతో ఆప్యాయంగా జాబులు రాసి చాకిరీ చేయించుకునేవాళ్లే గాని, ఈ చుట్టాలంతా నా అవసరం వచ్చే సరికి జారిపోయేవాళ్లేకదా' అని గ్రహించి సరమ్మ నోరు మూసుకుని ఊరుకుంది.

ఇంతలో వర్షాకాలం వచ్చింది. మునసబు తన పెరట్లోనూ, తను కొత్తగా కలుపుకొన్న ఆ సరమ్మ పెరట్లోనూ కొబ్బరి మొక్కలు నాటించాలనే వుద్దేశంతో గోతులు తవ్వించి ఉంచాడు. గోతులు చూద్దామని అతడు ఒకరోజున అక్కడికి వచ్చేసరికి సరమ్మగారు గోనెసంచీ ఒకటి పుచ్చుకుని వెళ్లి, మునసబు కొత్తగా ముందుకు జరిపి వేయించిన ఆ కట్టవవద్ద నిలబడి, 'బాబూ మునసబుగారూ!' అని పిలిచింది.

ఆయన ఉలిక్కిపడి పెరడు కలుపుకొన్నందుకు యేమి శాపనార్థాలు మొదలుపెడుతుందో అని భయపడ్డాడు. కాని సరమ్మగారు అతణ్ణి ఒక్కమాట కూడా అనలేదు. 'బాబూ, వీధిగుమ్మాలూ, గోడలూ బెల్లులు ఊడి, పాడుపడ్డాయి. మెత్తుకోడానికి తవ్వి ఉంచిన మట్టిలో ఒక్క గోనెడు తీసుకోనివ్వండి' అంది.



మునసబు ఆలోచించాడు. 'ఇరవై గజాల పెరడు కలుపుకొన్నామే. ఒక్క గోనెడు మట్టిఇస్తే పోయిందేమిటి? ఇంతకూ మట్టేకదా అడిగింది? పెరడునుగురించి యేమీ పేచీపెట్టనేలేదు నేను భయపడ్డట్టుగా' అనుకొని, 'తీసుకోండమ్మా సరమ్మగారూ! ఒక్క గోనెడుకాదు, మీకు కావలసినంత మట్టి పట్టించుకు వెళ్లండి. ఈపాటి దానికి నోరుతెరిచి అడగాలెనా!' అన్నాడు.

సరమ్మగారు కట్టవ దాటి వెళ్లి, తవ్వి సిద్ధంగాఉన్న మట్టిని గోనెనిండా నింపుకొని 'బాబూ, మునసబుబాబూ!—కాస్త ఈ బస్తా నా నెత్తిమీదకి ఎత్తిపెడుదూ?'అంది.

అ మాట వినేసరికి మునసబుకి కోపం వచ్చింది. 'నేను మునసబునికదా! నీకు మూటలెత్తే నౌఖర్ననుకున్నావా?' అని అందామనుకొన్నాడుగాని, మరుక్షణంలోనే 'అనాథపక్షి! ఎత్తి పంపేస్తే దీని పీడ వదిలిపోతుంది. ఈమెను రెచ్చగొట్టి, గోళ్లతో చీల్చతగ్గ తగాయిదాని గొడ్డళ్లవరకూ తెచ్చుకోట మెందుకూ?' అనుకుని, 'సరే' నంటూ సిద్ధపడ్డాడు.

సిద్ధపడ్డాడేకాని మునసబు బస్తాఎత్తలేక పోయాడు.

అతిసుకుమారంగా పెరిగిన ఆ అధికారి చేతుల్లో ఒక్క మట్టిబస్తాను ఎత్తేటంత సత్తువ లేకపోయింది. 'ఇంత బరువు నెత్తటం నాకు సాధ్యంకాదు; ఎవణ్ణయినా పిలుచుకురావమ్మా వెళ్లి' అన్నాడు.

సరమ్మ చరచరా వెళ్లి, వీధిని పోయే వాళ్లనందర్నీ పిలుచుకొచ్చింది. వాళ్లు, ఎందుకు చెప్మా? అని నిలబడి చూస్తొంటే ఆమె, 'విన్నారా బాబులూ? కాస్త ఈ మట్టిబస్తాని నా నెత్తిమీదకు ఎత్తమంటే ఎత్తలేకపోయాడీయన! ఒక్క బస్తా బరువునే ఎత్తలేని ఈయన, నా ఇరవై గజాల పెరడూ తన పెరట్లో అన్యాయంగా కలిపేసుకు సంపాదించిన ఆ పాపభారమంతా, రేపు యములాళ్లు వచ్చి లాక్కుపోయేటప్పుడు ఎలా మోసుకువెడదామనుకుంటున్నాడో మీరే కనుక్కోండి!' అంది.

ఈ మాటలు విన్న మునసబు మరి అక్కడ క్షణం నిలబడలేదు. ఆ మర్నాడే, కట్టవ వచ్చిన దారినే వెనక్కి వెళ్లి యథాస్థానంలో నిలిచింది. సరమ్మకి డబ్బు ఖర్చులేకుండా మునసబు తవ్వించిన గోతులు లభించటంచేత, వాటిల్లో మునసబు వేయిద్దామనుకొని సిద్ధంచేసుకొన్న ప్రకారం గంగాబొండంచెట్లు సరమ్మగారే నాటించి యావజ్జీవితమూ హాయిగా ఫలసాయం అనుభవించింది.

2304






శాంబరీ నగరంలో చతురుడనే ముచ్చివాడొకడు ఉండేవాడు. ముచ్చివాడంటే బొమ్మలు చేసేవాడు. చతురుడు చేసే లక్క విగ్రహాలన్నీ ప్రాణాలున్నవాటికిమల్లే ఊపిరాడిస్తో, కంటిఱెప్పలు వాలుస్తో గుండెలు కొట్టుకుంటూ ఉండేవి. బొమ్మలోపల మరలు అమర్చి కూచోబెట్టేసరికి అక్కడెవరో మనిషి కూచున్నట్టే అనిపించి, వచ్చినవాళ్లంతా ఆ బొమ్మతో మాట్లాడేవాళ్లు! ధనవంతులు చతురుడిచేత రక్షకభటులమోస్తరుగా బొమ్మలు చేయించి, రాత్రిపూట గుమ్మాలముందు కాపలా పెట్టేసరికి, దొంగలు ఆ బొమ్మల్నిచూసి, నిజంగా రక్షకభటులే అని హడిలి, పారిపోయేవాళ్లు. అవి అంతటి జీవకళతో ఉట్టిపడేవి.

చిత్రమైన ఈ బొమ్మలు చాలా ఖరీదు ఉండేవి. వాటిమూలాన చతురుడు బాగా డబ్బు గడించి ఉండవలసిందేకాని, అలా జరగలేదు. ఏమీ అంటే, చతురుడు ఉబ్బులింగడు. తమ విగ్రహాలు తయారు చేయించుకోవాలని సరదా ఉండి, చేత పైసాలేని బికారీవాళ్లు వచ్చిచేరి చతురుణ్ణి పొంగవేసెవాళ్లు. చతురుడు ఆ భట్టుల స్తోత్రాలకు ఉబ్బిపోయి, చవకగానో, లేక ఉచితంగానో వాళ్లకి తలకొక బొమ్మా సమర్పించి, వాళ్ల దీవెనలతో తృప్తిపడుతూ ఉండేవాడు.

* * *

ఆ నగరంలోనే భావికాలజ్ఞుడనే జ్యోతిష్కుడుకూడా ఉండేవాడు. అయన చెప్పినదల్లా అక్షరాలా జరిగి తీరుతుందన్న కీర్తి దేశమంతటా వ్యాపించింది. నలుగురితో పాటు చతురుడున్నూ ఒకనాడు ఆ జ్యోతిష్కునివద్దకు వెళ్లి తన జాతకం ముందు పడేశాడు. భావికాలజ్ఞుడు చక్రమూ, గ్రహగతులూ చూసి, పెదవి విరిచాడు.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు



"ఏమిస్వామీ, అలా చూస్తున్నారు? నా జాతకం ఏవిధంగా ఉన్నదీ?" అని అడిగాడుచతురుడు. 'తరువాత స్తిమితంగా చూదాం లేవయ్యా' అంటూ భావికాలజ్ఞుడు జాతకం తిరుగా ఇచ్చేశాడు. చతురుడుకి గాభరా ఎత్తిపోయింది. కారణమేమిటో తెలియకుండానే చతురుడు బెంగచేత నిద్రాహారాలు మానుకున్నాడు. వాడి స్నేహితుడొకడు జ్యోతిష్కునివద్దకు వెళ్లి, 'బాబూ, చతురుడు కృశించిపోతున్నాడు. ఏదైనా ఆపద రానుంటే తెలియజేయండి. తప్పించుకునే ఉపాయం ఆలోచించుకుంటాడు' అనికోరేడు.

అందుకు జ్యోతిష్కుడు, 'వెఱ్ఱివాడా, వాడికి రాబోతున్నది తక్కువ ఆపద కాదోయ్! వచ్చే బహుళ నవమినాటిరాత్రి వొంటిగంటా ఏడు నిముషాలకల్లా కొంచెం జాగర్తలో ఉండమను' అని అన్నాడు. 'ఐతే బాబూ!—గ్రహశాంతులూ, అభిషేకాలు ఏమైనా చేయిస్తే గండం తప్పదా?' అని మళ్లీ ప్రశ్నించాడు ఆ వచ్చినతడు. అప్పుడు దైవజ్ఞుడు 'మృత్యువును ఎవరు తప్పించుకోగలరోయి. సముద్రమధ్యాన ఒంటి స్తంభం మేడ కట్టించుకు దాక్కొన్న పరీక్షిన్మహారాజుకే చావు తప్పలేదు, మానవమాత్రుడి సంగతి వేరే చెప్పాలా?' అని చెప్పి పంపేశాడు.

వాడు వెళ్లి చతురుడితో అంతా పూసగుచ్చినట్లు చెప్పి, 'ఇంక పురాణ పఠనంలో కాలం గడుపుకొని ముక్తిమార్గం చూచుకో. ఇదుగో భాగవతం తెచ్చాను' అంటూ ఆ పుస్తకం ఇచ్చి వెళ్లాడు. చతురుడు తనకు రాబోయే చావునుగూర్చి చాలా దుఃఖించాడు. ఏడ్చి ఏడ్చి నిద్రపోయి లేచేసరికి వాడికో ఆలోచన తట్టింది. వెంటనే బజారుకు వెళ్లి బండెడు లక్కా, రకరకాల రంగులూ, అనేకమైన మరలూ కొనుక్కు

2307

తెచ్చి, ఇంట్లో తలుపులు బిడాయించుకుని నిలువుటద్దానికి ఎదురుగా కూచుని పని ప్రారంభించాడు. అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంటూ, అచ్చు తనపోలికగానే నాలుగు బొమ్మలు తయారుచేశాడు. ఆ నాలుగు విగ్రహాలూకూడా తనకిమల్లేనే కళ్లు తెరుస్తున్నాయి, మూస్తున్నాయి. అతని గుండెకుమల్లేనే వాటి గుండెలూ కొట్టుకుంటున్నాయి. ఆ బొమ్మలలో ఎక్కడ ఏయే మరలు ఎలా అమర్చాడో కాని, వాడి శరీరంలోమల్లేనే ఆ విగ్రహాలలోకూడా నాడులలో రక్తం ప్రవహిస్తూన్నట్టే కనపడింది.



గిఝమంటూ బహుళనవమీ ఇట్టే వచ్చేసింది. కాని చతురుడికి మాత్రం చావు దగ్గరపడుతోందన్న అధైర్యమే లేదు. రాత్రి పదీ అవటంతోనే ఐదుపక్కలు వేశాడు. మధ్యని ఉన్న మూడోపక్క తనకు కేటాయించుకుని తక్కిన వాటిమీద అటూయిటూ తయారుచేసిన బొమ్మల్ని పరుండబెట్టాడు. తన పక్కమీద తను పరుండి, ఏంజరుగుతుందో అని ఎదురుచూచాడు.

ఇంతలో గడియారం పదకొండు గంటలు కొట్టింది, పన్నెండు కొట్టింది. ఒంటిగంటకూడా కొట్టేసింది. సరిగ్గా ఆ సమయానికి ఇద్దరు యమదూతలు మెల్లిగా గది ప్రవేశించారు. పక్కలమీద పరున్న పంచమూర్తుల్నీ పరిశీలించారు. అందులో చతురుడు ఎవరో తెలుసుకోలేకపోయారు. ఒక నిముషం ఇలా గడిచేసరికి, ఆ దూతలలో ఒకడికి మెరుపులాగ ఒక ఆలోచన తట్టి, మళ్లీ పక్కలవద్దకు వెళ్లి, ఆ పరున్న వాళ్లలో ఒక్కొక్కణ్ణీ గిల్లి చూడటం ప్రారంభించాడు.

'ఎందుకురా?' అని రెండోవాడు అడిగేసరికి వాడు, "ఏం లేదూ? గిల్లితే ఎవరు మనిషో, ఎవడుబొమ్మో తేలిపోతుంది.

మనిషైనవాడు, నొప్పిపెట్టి 'అమ్మోయ్' అని కొంచెమైనా కదలకపోతాడా ?" అని తన యుక్తి వెల్లడించాడు.

వాడి ఆలోచన బాగానేఉంది గాని చతురుడు ఆ యుక్తికి లొంగలేదు. ఉగ్గ బట్టుకుని ఆ బాధ సహించాడే కాని బయటపడలేదు. యమదూతలు ఏం చెయ్యటానికీ తోచక వ్యవధి లేదన్న ఖంగారుతో యమలోకానికి పరుగెత్తి చిత్రగుప్తుడితో, 'బాబూ, ఆ ఐదుగురిలో బొమ్మలేవో, శిల్పి ఎవడో తెలిసిందికాదు' అని మొరపెట్టుకున్నారు. చిత్రగుప్తుడు చిఠాలు తిరగేసి, చతురుని చరిత్రంతా ఒక్కమాటు చదివాడు. "ఈ శిల్పి స్తోత్రాలకి ఉబ్బిపోతాడు" అని వానిని గురించి వ్రాయబడివుంది. "వెళ్లి భట్టుమూర్తులకుమల్లే స్తోత్రాలు మొదలెట్టండి" అని వాళ్లని మళ్లీ పంపేడు చిత్రగుప్తుడు..

వాళ్లు తిరిగి వచ్చి చతురుని గది ప్రవేశించి, వాడికి వినపడేటట్లు, "ఓహోహో ఎంత గొప్ప శిల్పిఅయ్యా ఈ చతురుడు! కాస్తంతయినా ఆనవాలు తెలియకుండా తనలాంటి విగ్రహాలనే నాలుగింటినీ సృష్టించేశాడు! బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చెయ్యగలిగినవాడు ఆ విశ్వామిత్రుడు ఒక్కడే అనుకున్నాం కాని నిజంగా ఆ ఋషిని మించినవాడు ఈ చతురుడు! చతురుడుకీ జయీభవ! దిగ్విజయీ భవ!" అంటూ కైవారం మొదలెట్టేరు.

ఆ స్తోత్రం వింటూన్న చతురుడి ఆనందానికి మేరలేకపోయింది. సంతోషంవల్ల పొరలివచ్చే పొంగును అరికట్టలేక పోయాడాశిల్పి. అతడి బుగ్గలు ఎర్రపడినై. పెదవిపైన చిఱునవ్వు మొలకెత్తింది. "దొరికేడురా దొంగ!" అంటూ యమదూతలు అపరిమితమైన సంతోషంతో చతురుడి మెడకు పాశాన్ని తగిలించారు. ప్రాణంలేని బొమ్మలు ఏమిటి చేయగలవు? అందుచేత అవి అలాగే ఉండిపోయాయి.






పూరీజగన్నాథం సమీపంలో కుండుబిల్వ మనే గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో నారాయణభట్టు, కమలాబాయి అనే పేద దంపతు లుండేవారు. వారికి వరప్రసాదంగా కలిగిన కుమారునికి జయదేవుడు అని పేరుపెట్టి ముద్దుగా పెంచుకొంటున్నారు.

జయదేవుడు పిన్ననాటినుండి భగవన్నామసంకీర్తనం చేసికొంటూ సమస్త విద్యలలోనూ గొప్పగా ప్రకాశిస్తూవున్నాడు. భక్తులు తరించటానికి తగినట్టుగా జయదేవుడు 'గీతగోవింద' మనే ఒక గొప్ప గ్రంథం వ్రాశాడు. ఈమహాగ్రంథం బయట పడగానే జయదేవుని ఖ్యాతి మిన్ను ముట్టింది. జయదేవకవిని దర్శించుకుని, గీతగోవిందంలోని పరమార్థం తెలుసుకుని తరించుదామనే తాపత్రయంతో జనులు తండోపతండాలుగా కుండుబిల్వ గ్రామం పోసాగారు.

కుండుబిల్వానికి పోవాలంటే జగన్నాథం మీదుగా వెళ్ళాలి. ఆకాలంలో జగన్నాథక్షేత్రం సాత్యకి అనే రాజు పాలన కింద ఉంటూవుండేది. జయదేవుని మీద అసూయకొద్దీ సాత్యకికూడా పోటీగా ఒక గీతగోవిందగ్రంథం వ్రాసి, 'జయదేవుని పుస్తకం ఎవ్వరూ చేతితో తాకకూడదు, నేను వ్రాసినగ్రంథమే చదవాలి' అని శాసనంపెట్టి, ప్రజలచేత బలవంతాన తన గ్రంథం చదివింప జూచాడు.

ఏమోకాని, ప్రజలకు రాజు వ్రాసిన పుస్తకం రుచించలేదు. 'జయదేవుని గ్రంథమే గ్రంథం. తరణోపాయం చూపగల పవిత్రగ్రంథం. సాత్యకిరాజుపుస్తకంలో యేమున్నది? పట్టిచెత్త, ఊక. ఇది చదవనే చదవము. కంటితో చూడనైనా చూడం' అంటూ ఈవిధంగా నిర్భయంగా తమ అభిప్రాయాలు వెల్లడిస్తూ వచ్చారు.

డి. ఏకాంబరం, చిత్తూరు





ఇదంతా చూడగా, అసలే జయదేవుని పైన అసూయతో మగ్గిపోతున్న సాత్యకి రాజుకు అగ్గిమీద గుగ్గిలం వేసినట్టుఅయి, కుండుబిల్వంపోయే జనసమూహానికి తీరని ఆటంకాలు కల్పించ నారంభించాడు. అతడు ఇలా చేసినకొద్దీ, లోకులకు అతని మీదా అతని గ్రంథంమీదా, అసహ్యం కలిగింది. జయదేవునిపైనా అతని గీత గోవిందంపైనా అభిమానం ఎక్కువ కాజొచ్చింది.

ఎలాఐనా తన గ్రంథమే ఉత్తమమైనదని నిరూపించటానికి సాత్యకి ఒక పరీక్ష పెట్టాడు. ఆ యేర్పాటుప్రకారం తన గ్రంథమూ, జయదేవుని గ్రంథమూ జగన్నాథస్వామి పాదాలవద్ద ఉంచి, రాత్రి పూట గుడితలుపులు మూసివేశారు. మరునాడు ఉదయమే వచ్చి చూడగా, జయదేవుని పుస్తకం ఎక్కడపెట్టింది అక్కడనే వుంది చెక్కుచెదరకుండా. సాత్యకిరాజు గ్రంథంమటుకు గుడి వెలుపల దుమ్ములో పొరలాడుతూ వుంది!

ఈ అవమానం భరించలేక సాత్యకి రాజుకు పిచ్చిపట్టినట్టయింది. జగన్నాథస్వామిని నోటికి వచ్చినట్టల్లా దూషింపసాగాడు. అప్పుడు స్వామి ప్రత్యక్షమై, "రాజా!—నీకు నాపైగల భక్తియేమో తక్కువదిగాదు. అయితేనేం, అహంకారమనేది మానవునికి ఉండకూడని చెడు గుణాలలో ఒకటి. నీకు పట్టివున్న ద్వేషబుద్ధివల్లనే నీపైనా నీ గ్రంథంపైనా లోకానికి అసహ్యత పుట్టింది. కనుక, నిన్ను అనుగ్రహించటానికే ఇప్పుడు వచ్చింది. నీవువ్రాసిన గీతగోవిందంలోని 24 శ్లోకాలు మొట్టమొదట చదివినతరవాతనే జయదేవుని గ్రంథం ప్రజ చదివేటట్టు వరమిస్తున్నాను" అని చెప్పి అంతర్ధానమయ్యాడు. స్వామి మహిమవలన సాత్యకి

2311

రాజు రచించిన గీతగోవిందంలోని 24 శ్లోకాలు జయదేవుని పుస్తకంలో ప్రారంభంలోనే కనబడజొచ్చినై.

* * *

సాత్యకి పాలనకింద ఉన్న జగన్నాథపట్టణమందే ధనవంతుడైన ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయనకు అపురూపంగా ఒక కూతురు పుట్టింది. విశాలమైన కన్నులతో వెలుగొందే ఆపిల్లకు పద్మావతి అని పేరు పెట్టి, ఆ దంపతులు మక్కువగా పెంచుకొంటున్నారు.

ఆ బ్రాహ్మణుడు ధనవంతుడేగాక గాఢమైన కృష్ణభక్తుడు. కూతురు పెద్దదై, పెళ్లియీడు వచ్చేసరికి ఆమెను ఎవరికి ఈయటమా అని ఆలోచించి, చివరకు 'పద్మను నా చిన్నికృష్ణునికే యిచ్చిచేస్తాను. దీనికి తిరుగులేదు' అంటూ తన నిశ్చయాన్ని వెల్లడించాడు. ఎందరెందరో పద్మను అడగవచ్చారు; వారందరకూ ఆయన ఇదే సమాధానం చెప్పి పంపాడు. 'ఇదేమిటి ఈ పిచ్చిబ్రాహ్మడు మానవరూపంలోవుండే పిల్లనేమిటి, శ్రీ కృష్ణపరమాత్మకు ఇచ్చి పెళ్లిచేయడ మేమిటి, విడ్డూరం కాకపోతే?' అనుకొంటూ మరలిపోయేవారు.




ఒకరోజున ఆ బ్రాహ్మడికి శ్రీకృష్ణుడు కలలో కనపడి, "బ్రాహ్మడా! నీ భక్తికి మెచ్చుకున్నాను. నీకోరిక నెరవేరాలంటే పద్మను నా భక్తుడైనటువంటి ఫలానా జయదేవునికి ఈయవలిసింది. ఇదే నాకు తృప్తి, పరమ సంతోషమున్నూ' అనిచెప్పి అదృశ్యుడైనాడు. ఆ ప్రకారం బ్రాహ్మడు జాగు చేయక, పద్మను జయదేవునికిచ్చి వివాహం జరిపించాడు. పద్మ పతిభక్తికలిగి సంసారం చక్కగా నడుపుకొంటూవుంది.

* * *

జయదేవుడు ఇలా గృహస్థాశ్రమం సాగిస్తూవుండగా కొన్నాళ్లకు ఒక వర్తకుడు




2312

వచ్చి "మహానుభావా! విష్ణుస్వరూపా! మా వూరు దయచేసి, మా గృహం పావనం చేయండి. పరమార్థానికి దారి చూపే ఉపదేశం చేసి తరింపజేయండి, స్వామీ!" అంటూ ప్రార్థించి తన గ్రామానికి తీసుకపోయాడు. అక్కడ జయదేవునికి శిష్యుడు సమస్త ఉపచారాలు చేస్తూ, క్షణమైనా ఏమరక శుశ్రూషలు జరుపుతూ వచ్చాడు. వర్తకుడికి జ్ఞానబోధచేసిన కొంతకాలానికి జయదేవుడు 'మరి ఇంటికి వెళతా' నన్నాడు.

భక్తిప్రపత్తులతో వర్తకుడు ఒక దివ్యమైన రథం సిద్ధం చేయించి, అపారమైన ధనము, రకరకాల రత్నాలు, వెలలేని మణులు, అపురూపమైన కానుకలూ అందులో పెట్టి, నమ్మకమైన సేవకులను తోడిచ్చి అతి కోలాహలంగా గురువుగారిని సాగనంపాడు.

కొంతదూరం వెళ్లేసరికి, ఆ సేవకులకు దుర్బుద్ధి పుట్టింది. వారు కూడబలుక్కొని, రథాన్ని మరుగుస్థలంలో నిలిపి జయదేవుని కాళ్లూ చేతులూ తెగనరికి, అతనిని నీళ్లు లేని ఒక పాడుబావిలో పడవేశారు. రథంలో వుండే సమస్తమైన కానుకలూ, ధనమూ, రత్నాలూ, మణులూ దోచుకుని మరి కనబడకుండా వాళ్లు మాయమయ్యారు. పాడునూతిలో పడిన జయదేవుడు అక్కడనే హరిభజన చేసుకొంటూ వున్నాడు. జయదేవుని పరీక్షకుపెట్టిన జగన్నాథస్వామి, అతనికి కాలుసేతులు నరకటంవల్ల కలిగే బాధలేకుండా, తక్షణమే దెబ్బలు మాని పోయేటట్టు కటాక్షించాడు.

ఇంతలో క్రౌంచకుడనే ఒక రాజు వేట నిమిత్తం ఆ ప్రాంతానికి రాగా, పాడునూతిలోనుండి పాట వినబడింది. చిత్రమేమిటా అని పోయి చూచాడు. అందులో మానవుడు కంటబడేసరికల్లా వెంటనే పైకి

2313

తీయించి, ఒడ్డున చేర్పించి, ఇలా జరగ టానికిగల కారణం ఏమిటని ప్రశ్నించాడు. అందుకు జయదేవుడు తనవల్ల ఎవ్వరికీ హాని కలగటము మనస్కరించక "అయ్యో, నా పుట్టుకే యింత..." అని సూక్ష్మంగా చెప్పి తప్పించుకొన్నాడు.

తరువాత క్రౌంచకుడు జయదేవుని తన యింటికి తీసుకపోయి, అతనిభక్తీ యోగ్యతా గ్రహించాడు. జయదేవుని గురువుగా ఎంచుకుని, ఉపదేశం పొంది, అయనను అన్ని విధాలా పూజిస్తూ ఉండేవాడు.




ఇలా ఉండగా ఒకనాడు పరమభక్తుడైన జయదేవునికి శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై, తిరుగా కాళ్లూ చేతులూ వచ్చేటట్టు అనుగ్రహించాడు. ఎప్పుడైతే జయదేవునికి కాళ్లూ చేతులూ వచ్చినయో, అక్షణమందే క్రౌంచకుడు 'ఈయన కేవలమూ దైవమే కాని వేరుకాదు. పుణ్యంకొద్దీ ఈ స్వరూపంలో నాకు లభ్యమైనాడు' అని సంతోషించి శాశ్వతంగా జయదేవుని తన మండిరమందే ఉంచేసుకోవాలెనని నిశ్చయించాడు. ఈ సంకల్పంతో రాజు జయదేవుని భార్య ఐన పద్మావతినికూడ రప్పించి, ఆ దంపతులను భక్తితో సేవించుతూ ఉన్నాడు.

పద్మావతికికూడ ఒక అగ్నిపరీక్ష తటస్థించింది. ఒకనాడు అంతఃపురంలో రాణీ, పద్మావతీ, మరికొంతమంది స్త్రీలూ కూర్చుని మాట్లాడుకొంటూ వుండగా, సేవకుడు వచ్చి 'అమ్మా! అన్నయ్యగారు అకస్మికంగా కాలంచేసినారట!' ఆయనతో పాటు వదినెగారున్నూ సహగమనం చేశారట!' అని చెప్పాడు. రాణీ ఎంతగానో దుఃఖించింది.

పద్మావతి ఊరుకోక, సహగమనమంటే తనకుగల అయిష్టతను సూచించింది. అది మూఢనమ్మికలు ఎక్కువగా అల్లుకొనివున్న కాలం గనుక, సహగమనపద్ధతికి అను

శూలంగావుండే రాణికి ఈ మాటలు ములుకులవలె గుచ్చుకున్నాయి. 'పద్మావతిని పరీక్షకు పెట్టి బాగా బుద్ధి చెప్పాలె' అనే దీక్షతో అదనుకోసం కనిపెట్టుకుని వుంది.

* * *

ఒకరోజున రాజు, గురువైన జయదేవుని వెంటబెట్టుకుని వేటకు వెళ్లాడు. ఈ తరుణం చూచి రాణి కుట్ర పన్నింది. ఇంతలో రాణి పరివారంతో సహా అంతఃపురంలో ఉండగా ఒక సేవకుడు వచ్చి "అమ్మా! వేటలో ఒక పులి జయదేవునిపైన పడి ఎత్తుకపోయింది....!" అంటూ ఆత్రంతో చెప్పాడు. ఈ మాట చెవిని పడినదే పద్మావతి కన్నులుమూసి, ప్రాణాలు వదిలింది.

కొంచెంసేపటికల్లా రాజు వేటనుండి మరలివచ్చాడు. అంతఃపురంలో జరిగిన కుట్ర వెల్లడి ఐంది. "ఆహా ఎంత ఘోరం! దీనంతకూ కారణం నేనే' అనుకొని తక్షణమే కొడుకునకు పట్టం కట్టి, మంత్రులకూ, సేవకులకూ వప్పగింతలుపెట్టి, తను అగ్నిప్రవేశం చేయటానికి కృతనిశ్చయుడైనాడు. ఈ పని చేయటానికి ముందుగా ఒక్కసారి గురువర్యుడైన జయదేవునివద్దకు పోయి, ఆయనకు పాదాక్రాంతుడై, "మహాత్మా! పరమపాపిని, క్షమించు..." మంటూ అంతఃపురంలో జరిగిన చర్యను వెల్లడించాడు.

జయదేవుడు చలించక 'అంతా స్వామి కటాక్షమే' అంటూ, నిండుభక్తితో స్వామిని ఉద్దేశించి 24 అష్టపదులు గానంచేసేసరికల్లా జగన్నాథుడు ప్రత్యక్షమై, పద్మావతికి ప్రాణం పోశాడు. 'మహత్తరములైన ఈ అష్టపదులను ఎవరు గానంచేస్తారో, వారికి ముక్తి కలుగుతుం'దనికూడా సెలవిస్తూ, స్వామి అంతర్ధానమయ్యాడు. ఈ అష్టపదులతో కూడిన గ్రంథమే 'గీతగోవిందమ్'. ఈనాడు భారతదేశమంతటా అల్లుకుని, భక్తజనులకు అమృతప్రాయంగా వుంటున్నది.



328 2315




రాజధానీ మొత్తంమీద పేరుపడ్డ గ్రాంటు స్కూలు పిచ్చయ్య పంతులుది. ఇది నీలాపురానికి రెండున్నర కోసులు దూరంలో వున్న లంకెలపాలెంలో స్థాపించబడింది. చిరకాలంనించీ ఏయేటికాయేడు 'ఇంక్రిమెంటు'తో సహా, గొప్ప గ్రాంటు అందుకుంటున్నాడు పిచ్చయ్య పంతులు.

చదువుల బడులకు సంబంధించిన ఏ ఉద్యోగస్థుడైనా వచ్చాడనేసరికి పంతులు తన తాతలనాటి నల్ల లాంగుకోటు తొడుక్కుని, బుట్టపాగా తగిలించుకుని, పైమీద వోణీ వేసుకుని, చంకలో రిజిస్టర్ల దస్తరం దోపుకొని, లేత కొబ్బరికాయలూ రకరకాల కానుకలూ చేతపట్టుకున్న శిష్య బృందంతోసహా బయల్దేరుతాడు.

నీలాపురం చేరుకున్న పిచ్చయ్యపంతులు ఉద్యోగస్థుని దర్శనం చేసుకున్నాక, సవినయంగా నమస్కరించి, ముందుగా లేత కొబ్బరికాయ నీళ్లు ఇస్తాడు. ఉద్యోగి అవి అరగించగానే ఆడపిల్లలు పూలదండలు మెడలోవేసి, వరసగా నించుని ప్రార్థన పాటలు పాడతారు. దాంతో ఉద్యోగి ఉబ్బిపోతాడు. వాళ్లను అయన కొన్నిప్రశ్నలు కూడా వేయటం కద్దు. ఆ తరవాత పిల్లలు తెచ్చిన కానుకలన్నీ అధికారికి అందజేస్తారు. అప్పుడు పిచ్చయ్యపంతులు అధికారితో "అయ్యా! ఏదో మీ దయవల్ల ఇంతకాలంనించీ విద్యాశాఖలో సేవ చేసుకొంటూ వున్నాను. ఈనాడు మా బళ్లో విద్యార్థుల సంఖ్య 250. ఒకొక్క తరగతిలో కొంతమందిని మాత్రం మచ్చుగా వెంటబెట్టుకువచ్చాను. వీళ్లని పరీక్షచేస్తే స్కూలు మొత్తం పరీక్ష చేసినట్టేనండి" అని చంకలో రిజిస్టర్లదస్తరు అధికారిముందు పెట్టేవాడు.

'సరే మేష్టారూ! మరి బయల్దేరదామా?' అని అధికారి అనేసరికల్లా అందుకు అభ్యం

యం. వెంకటరమణమ్మ, నెల్లూరు



తర మేమిటున్నది బాబూ! ఐతే, ఒక్కటే చిక్కు. మా లంకెలపాలేనికా బండిదారి లేదు. అయిదు మైళ్లూ కాలినడకని పోవలిసిందే. దారి పొడుగుతా ముళ్లు గుచ్చుకుంటై. అడుగడుక్కీ పాములు కాళ్లకి చుట్టేసుకుంటై. మోటువాళ్లం మేమే రాకపోకలకు యమయాతన పడుతూవుంటాం' అంటూ వర్ణించి చెప్పేస్తాడు పంతులు.

'ఊఁ - పోనీ, అటువంటి కుగ్రామానికి పోయి అవస్థంతా ఎవడు పడగలడు !' అని అనుకొని ఉద్యోగస్థులు అక్కడనే కూర్చుని 'విజిటర్సు బుక్కు'లో పిచ్చయ్యపంతులు స్కూలునుగురించి అమోఘంగా రిమార్కులు వ్రాసిపోయేవారు. వీటినిబట్టే పిచ్చయ్యకు గొప్ప పేరువచ్చేసి, కడుపులో చల్ల కదలకుండా ఆయన పెద్ద గ్రాంటు అందుకోవటానికి వీలుచిక్కింది.

ఒకసారి ఒక విద్యాశాఖాధికారి వచ్చాడు. ఈసంగతి తెలియుగానే పిచ్చయ్య పంతులు యథాప్రకారం పిల్లలతో, రిజిస్టర్లతో, లేతకొబ్బరికాయలతో, కానుకలతో సహా అధికారి ఎదట హాజరైనాడు.

చిరునవ్వుతో అధికారి "రాండి మేష్టారూ!—మీ స్కూలును గురించిన రిమార్కులన్నీ చూచాను. చాలా నంతోషమైంది. అవి చూచినప్పటినించీ మీ స్కూలుకు ఎప్పుడు రావటమా అని ఆత్రంతోనే వున్నాను. నేనూ బయల్దేరుతూవున్నా, మీరూ ఎదురైనారు..." అని ఇంకా యేమో చెప్పబోతూవుండగా పిచ్చయ్య పంతులు తెల్లబోయిన ముఖంతో "మావూరికా! తమరు రాగలరా!!" అన్నాడు బిత్తరపోయి. కాస్త తమాయించుకుని లంకెలపాలేనికి పోయే దారిని గురించి భయంకరంగా వర్ణించటానికి ప్రారంభించాడు.

అంతా విని అధికారి "మేష్టారూ!— మేమూ వ్యవసాయదారులమే. మాది మీ




లంకెలపాలెంకంటే కుగ్రామం. కాళ్లకు ముళ్లు గుచ్చుకోవటం, పాములు చుట్టేసుకోవటం నాకు చిన్నప్పటినించీ అలవాటే" అంటూ తన చరిత్రను వెల్లడించబోయేసరికి పిచ్చయ్య నిర్ఘాంతపోయాడు. అధికారి రాకతప్పేటట్టు లేదు. పంతులుకు కంగారెత్తింది. 'అయ్యా, నేను వెళుతూవుంటా, నెమ్మదిగా దయచేయండి తమరు' అనేసి పరుగుచ్చుకున్నాడు.

ఉరుకులేసుకొంటూ ఊరు చేరుకుని, పిచ్చయ్యపంతులు శేరు సెనగపప్పు కొని, రూపాయికి అణాకానులు మార్చి, పిల్లలను పోగేసుకు రావటానికని బయల్దేరాడు. అంతలోనే అధికారి ఊళ్లోకివచ్చి భోగట్టా చేయగా—నిజానికి ఆ ఊళ్లో స్కూలనేది లేదనీ, అధికారులు వచ్చినప్పుడు మాత్రం పంతులు పప్పుబెల్లాలుపెట్టీ డబ్బులు చేతికిచ్చీ పిల్లలను పోగేసుకవచ్చి హాజరు పెడుతూవుంటాడనీ తెలియవచ్చింది.

కాస్సేపటికల్లా పంతులు కొంతమంది పిల్లలను వెంటబెట్టుకువచ్చి 'బాబుగారూ! ఈ స్కూలనేది కేవలమూ అధికారుల కటాక్ష వీక్షణములతో కూడుకొన్నదే గాని, వేరే ఎక్కడ కనబడుతుంది! ఇంతకూ, ఈయేడు నాకు ఆదాయ వ్యయాలూ, రాజపూజ్యావమానాలూ బొత్తుగా బాగులేవన్నాడండి పంచాంగంశాస్త్రుల్లు" అన్నాడు.

అధికారి ఉగ్రుడై "సరిగానే చెప్పాడు ఆయన. మీరు చేస్తూన్న మోసాన్నిగురించి గట్టిగా కనుక్కోమని ఇప్పుడే వ్రాస్తున్నాను ప్రభుత్వానికి. అప్పనంగా ఇంతకాలంనించీ గ్రాంటు తినటానికి మీకు సహాయపడిన ఆ బద్ధకపు ఉద్యోగస్థుల సంగతికూడా కనుక్కోబోతా. నాకు పట్టుకున్న విచారం ఒక్కటే. మీద్రోహంవల్ల పాపం, అమాయకులైన ఈ వూరి పిల్లలకు చదువు లేకండా పోయిందే అని!' అంటూ మరలిపోయాడు.




పూర్వం ఒకప్పుడు కళింగదేశపు రాజు ఒక ప్రకటన చేశాడు-'కనివిని యెరుగని అపూర్వమైన దేవాలయం ఒకటి తన రాజ్యంలోని 'కోణార్క'లో నిర్మించాలనీ, పదహారేళ్లు గడువు పెట్టామనీ, ఈపని దిగ్విజయంగా నెరవేర్చినవానికి లక్ష మొహరీలూ, ఒక బ్రహ్మాండమైన సంస్థానమూ బహుమానం యిస్తామనీ, గడువునాటికి పని పూర్తికాకపోతే మాత్రం తల కొట్టించి కోటగుమ్మానికి వ్రేలాడదీయిస్తా' మనీ ఆ ప్రకటనలో స్పష్టంగా వ్రాయబడి వున్నది.

ఈ ప్రకటన చూచి ఎందరెందరో పనివాళ్లు వచ్చారు, వెళ్లారు. ఏమంటే రాజుగారు ఇస్తామన్న బహుమానం చూడబోతే ఆకర్షణీయంగానే వున్నది. కాని శిక్షమాట తలుచుకుంటేమట్టుకు గుండెలో గుబ్బాలు పరుగులెత్తసాగినై. అందుకని నిబ్బరం చాలక వాళ్లు కాళ్లకు బుద్ధిచెప్పేవాళ్లు.

చివరకు మహారాణాభీమ్ అనే శిల్పకారుడికి ఈ వార్త తెలిసింది. రాణా సామాన్యుడు కాడు. గొప్ప పనివాడు. మహా శిల్పి. అతని పనితనము పరీక్షించాలంటే అది మహారాజులకే తగును. ఐతే, తగిన అవలంబన లేక, రాణా ఒక కుగ్రామంలో కుమిలిపోతూ జీవితం నెట్టుకువస్తున్నాడు. స్వాతివానకు ముత్యపు చిప్పలు ఎదురుచూచినట్టు, తరుణంకోసం వేచివున్న రాణాకు ఈ ప్రకటన సంగతి తెలియగానే ప్రాణం లేచివచ్చింది.

'దైవం నాకిప్పుడు చక్కటి సావకాశం కల్పించాడు. ప్రపంచానికి నా పనితనము చూపుతాను. బహుమతి పొందుతాను. సంస్థానానికి అధిపతినవుతాను. నన్నుపట్టి పీడిస్తూవుండిన దరిద్రదేవతకు స్వస్తిచెప్పి, కలకాలమూ హాయిగా వుంటాను. ఎన్నాళ్లు ఈ లేకిబ్రతుకు? ఈదెబ్బతో రాణాకు

కె. సుగుణాబాయి, రాజమండ్రి

2319

దశపట్టి తీరాలి. అశాశ్వతమైన ఈ గుక్కెడు ప్రాణమూ ఉంటే యెంత, పోతే యెంత!' అనుకుని రాణా ఉవ్విళ్లూరాడు.

ఈ సంకల్పమెప్పుడైతే కలిగిందో అతడు క్షణమైనా జాగుచేయలేదు. ఇంటి విషయాలను కాస్తకూడ మనసులో చొరనీయలేదు. గర్భిణిగావున్న భార్యనైనా తలచలేదు. పిట్టకు తెలియకుండా పోయి, కళింగరాజు దర్శనం చేసుకుని, తన పుద్దేశం వెల్లడించాడు. 'తొందరపడకు, బాగా ఆలోచించుకుని మరీ పనిలోకి దిగవలసిం'దని హెచ్చరించాడు రాజు. 'ఆలోచించటమే కాదు, నిశ్చయమే చేసుకున్నా'నని చెబుతూ రాణా తన ప్రజ్ఞకూ, ప్రతిభకూ తగిన తార్కాణలు చూపించాడు.

రాజు సంతోషించాడు. "ఇంతవరకు వచ్చిపోయిన వాళ్లవంటివాడు కాడు వీడు. వాలకం చూడగా, ఆలయనిర్మాణం సాగించగలవాడుగానే కనబడుతున్నాడు. నేను తలపెట్టిన ఈ ఆలయమే వెలసిన నాడు 'కళింగప్రభువుకి సమానుడు దేశం మొత్తంమీదనే లేడు' అనే కీర్తి వచ్చేస్తుంది. ఇంతకంటే నాకు కావలసిందేముంది!" అని తలచి మనసులో కుతూహలపడ్డాడు.



రాజు తలిస్తే కొదవ యేమిటి గనకా? చూస్తూవుండగా, ఎక్కడెక్కడి వస్తు సామగ్రీ సమకూడింది. వేలకొద్ది నిపుణులు వచ్చి దిగారు. లక్షలకొద్ది కూలీజనం పని చేయ నారంభిస్తే ఆ ప్రదేశమంతా కనుపండువుగా కలకల్లాడజొచ్చింది. ఒకటి కాదు, రెండు కాదు—నిండు పదహారేళ్ల కాలం అయేసరికి రాణా ప్రారంభించిన ఆలయం పూర్తికావచ్చింది. నూటయెనభై అడుగుల ఎత్తున లేచింది ఆ గుడి. ఈ గుడి అన్ని గుళ్లవంటిది కాదు. దీని చమత్కారం ఏమిటంటే—ఇది సుమారు ఒక ఫర్లాంగు దూరంవరకూ సముద్రంలోకి చొచ్చుకు




పోయి, సూర్యభగవానునివేపు తిరిగివున్నది. అనగా ఉదయానే బాలభానుడు ప్రసరింపజేసేకిరణాలు ముందుగా ఈ గుడిమీద పడి, తరువాతనే లోకంలో వ్యాపిస్తవన్నమాట.

శిఖరమంతా తయారు చేశాడు రాణా. ఇక ఒక్కటేపని మిగిలివున్నది. దీనిని నూటఎనభై అడుగుల ఎత్తునవున్న గుడిపైకి ఎక్కించాలి. ఇది యెక్కించి, అమరిస్తే పని పూర్తి అయినట్టే. ఐతే—సుమారు అయిదువందల మణుగుల బరువుగల ఆ శిఖరాన్ని అంత యెత్తుకి తీసుకపోవడమెట్లా? మహాశిల్పి అయిన రాణాభీమ్‌కూ, అతనిక్రింద పనిచేసే వేలకొద్ది నిపుణులకూ

2320

ఆలోచన యేమీ పాలుపోయిందికాదు. పోతే, రాజు పెట్టిన పదహారేళ్ల గడువుకు ఇంక సరిగా పదిరోజులే వ్యవధి వున్నది.

కాలప్రవాహంలో పదిరోజులనగా ఎంత! తొమ్మిదిరోజులు యిట్టే గడిచిపోయినై. ఆ మర్నాటితో గడువు తీరిపోతుంది. గడువు దాటిందో రాజు ఎంతమాత్రమూ కనికరించడు. మహాశిల్పి ఐన రాణాపుచ్చె తెగిపడి కోటగుమ్మాన్ని అలంకరించవలసిందే!! రాజ్యంలో ప్రజంతా రాణాకు సంభవించిన ఈ విపత్తునుగురించే చెప్పుకోసాగారు.

ఇట్లా లోకమంతా రాణానుగురించి దుఃఖిస్తూవున్నప్పట్లో—పదహారేళ్లు నిండని బాలుడు ఒకడు ఆ కట్టడంవద్దకు వచ్చి, రాణాతో "అయ్యా! మిమ్ములనుగురించీ, మీరు చేస్తున్న మహత్కార్యాన్నిగురించీ విని సంతోషించాను. ఐతే, మీరు నిర్వహించిన ఈ కార్యము 'అంతా దాటి, చింతాకంత ఉండిపోయిం'దన్న స్థితిలో నిలిచింది. అందుకని మీకు రాగల విపత్తును గురించి 'అయ్యో! ఏమి కానున్నదో' అని లోకం ఉడికిపోతున్నది. ఈ సమయంలో విచారించి ప్రయోజనమేమున్నది? కర్తవ్యం ఆలోచించాలిగాని. రాజప్రకటన

2321




ప్రకారము పని నెరవేర్చి, బహుమతులు పొందాలి, కీర్తి ఆర్జించాలి. కనుక నాబుద్ధికి తోచిన వుపాయం చెప్పి, మీకు విజయం చేకూర్చాలెననే సంకల్పంతోనే ఇప్పుడు నేను వచ్చింది......" అనేసరికి రాణా, అతనితోపాటు వేలకొద్ది పనివాళ్లుకూడా బాలుని మాటలకు ఆశ్చర్యపోయారు.

బాలుని ముఖలక్షణాలు చూచేసరికి రాణాకు హృదయంలో ఒక మెరుపు మెరిసి నట్టయింది. విచారరేఖలు తొలగిపోయి, ధైర్యమూ, ఉత్సాహమూ పుట్టుకొచ్చినై.

వెంటనే ఆ కుర్రవాడు పెద్దపెద్ద దూలాలు రెండు తెప్పించి, వాటిని భూమి నించి గుడి గోపురంవరకు ఏటవాలుగా అమర్చాడు. ఆతర్వాత శిఖరానికి లావు పాటి మోకు కట్టి, దాని రెండవకొన గుడి పైన ఒక యినపగిలకలోంచి దూర్చాడు. అక్కడవున్న పనివారి నందరినీ పిలిచి, ఆ కొన పట్టుకు లాగమన్నాడు. ఆదేప్రకారం చేసేసరికి, శిఖరం బహు తేలికగా గుడిపైకి చేరిపోయింది. పని పూర్తిఅయింది!

ఆ క్షణంవరకూ తన ప్రాణాలు ఎగిరి పోతవని విచారసముద్రంలో మునిగివున్న రాణా, యిదిచూచి ఉప్పొంగిపోయాడు. అమాంతంవచ్చి అతడు కుర్రవానిని ప్రేమతో కౌగిలించుకున్నాడు. అక్కడి పనివాళ్లంతా "సెహబాస్, డింభకా!" అని వేనోళ్ళ మెచ్చుకొన్నారు.

తరువాత ఎవరిత్రోవన వారు ఎంతో ఉత్సాహంతో తమతమ యిళ్లకు వెళ్ళి పోయారు. ఆ కుర్రవాడిని వెంటబెట్టుకుని రాణా యింటికి బయలుదేరాడు.

త్రోవపొడుగూతా రాణా మౌనంగా నడచి పోతున్నాడేకాని, కుర్రవానిని పలకరించనే లేదు. ఇదిచూచి ఆ కుర్రవాడుకూడా, "ఇంతటి ఆపదనించి రక్షించానే 'నీ వెవ రవు, ఎక్కడినించి వచ్చావు?' అనైనా

అడగడేం చెప్మా? కానివ్వు. అడిగినప్పుడే చెబుదాం" అనుకుంటూ తనూ రాణా వెంట మౌనంగానే నడుస్తున్నాడు.

ఐతే, రాణా మౌనంగావున్నా బుర్రలో ఆలోచనలు పరుగెడుతునేవున్నై.

"ఇంతా శ్రమపడి కొనవరకూ పనిసాగించినది నేనే అయినా, చివరకు గుడి పూర్తి కావటం ఈ కుర్రవానివల్లనేకదా జరిగింది? ఇతను చూడబోతే మహా మేధావిలా కనిపిస్తున్నాడు. ఈ కుర్రవానిని ప్రాణాలతో వుంచితే త్వరలోనే ఈ గుడిని మించినగుడి కట్టవచ్చు. అలాగే జరిగినట్టయితే, నాపేరు ప్రతిష్ఠలు మంటగలిసిపోకతప్పదు. అందుచేత వీడిని తెగటార్చి తీరాలి" అనుకున్నాడు.

రాణాకు మనసులో ఈ దుర్బుద్ధి కలగటమూ, కత్తిదూసి ముందు నడుస్తూవున్న కుర్రవాని తల తెగనరకటమూ రెప్పపాటు కాలంలో జరిగిపోయింది. అంతటితో రాణాకు మనస్థిమితం చిక్కింది. విజయగర్వంతో రాణా యిల్లు చేరుకొన్నాడు.

భర్తనిచూస్తూనే రాణాభార్య "అబ్బాయి యేడీ?" అని ఆత్రంతో అడిగింది.

"అబ్బాయి ఎవరూ?" అంటూ తత్తరపాటుతో ప్రశ్నించాడు రాణా.

బిత్తరపోయింది ఆమె. "అలా అడుగుతారేమిటి, మన చిన్నవాడు ఎరగరా? మీరు తయారుచేసిన శిఖరాన్ని గుడిపైకి ఎక్కించటానికని బయల్దేరాడు కదా? వాడు మీదగ్గరకు రాలేదా?" అని కంగారుగా అడుగజొచ్చింది.

విశ్రాంతికోసం మంచంమీద కూలబడుదామనుకున్న మహారాణా ఒక్కసారిగా పైకి లేచాడు. "ఏమిటీ! శిఖరం ఎక్కించినవాడు మన చిన్నవాడా!! మన చిన్నవాడా!!!— నా కుమారుడా!!!..." అంటూ నేలకు ఒరిగిపోయాడు. అదే అతనికి శాశ్వతమైన విశ్రాంతి ఐపోయింది!!!





"బుల్‌బుల్ పిట్ట రాత్రంతా మేలుకుని పాడుతూవుంటుంది"

# ఎందుకో తెలుసా?

అనగా అనగా వో రాజుగారి తోట. ఆ తోటలో వో బుల్‌బుల్‌పిట్ట వుంది. వసంతం వస్తూనే తోటంతా అందాలు చూపింది. చెట్టు చెట్టూ చిగిర్చింది. తీగ తీగా మొగ్గ వేసింది. పూలవాసనలతోగాలిబరువెక్కింది. బుల్‌బుల్ కమ్మనిపాటలతో కొమ్మకొమ్మా రెమ్మ రెమ్మా తోటంతటా తిరిగేది. ఆ పాటలకు తోట తోటా పూగింది.

ఒకరోజున ఆ తోటలోకి యెక్కడ్నించో వో క్రొత్త బుల్‌బుల్ పడుచు వచ్చి, తోట అందం చూచి హాయిగా చివురాకులు కొరుకుతూ పళ్లు తింటూ పాటలు పాడుకొంటూ అక్కడ వుండిపోవాలనుకుంది.

బుల్‌బుల్ పడుచు వొక గున్నమామిడి కొమ్మమీద కూచుని చక్కగా పాడుతూ వుంది. మన బుల్‌బుల్ పిట్ట ఆ పడుచు చక్కదనానికి పాట కమ్మదనానికీ మెచ్చుకుని దానితో జట్టు కలిపింది. ఇలా రోజు రోజూ ప్రాద్దస్తమానం ఆ రెండు పిట్టలూ పాడుకుంటూ తోటలో ఆడుకుంటూ వున్నై.

ఓరోజున బుల్‌బుల్ పిట్ట "నన్ను పెళ్లి చేసుకుని నాతో వుండిపో" అని ఆ బుల్‌బుల్ పడుచును అడిగింది. అది 'రేపు సూర్యోదయంలోగా నేను చూడని క్రొత్తరకం పువ్వు తెచ్చియిస్తే సరి' అన్నది.

బుల్‌బుల్ పిట్ట పాటలు మాని చెట్టు చెట్టుదగ్గిరకు తీగతీగదగ్గిరకూ వెళ్లి క్రొత్త రకం పువ్వొకటి పూసివ్వమని అడిగింది. 'మావన్నీ పాతపువ్వులే. క్రొత్తరకం పువ్వు ఎలా పూయాలో మాకు తెలియనే తెలియదు బుల్‌బుల్!' అని చెప్పాయి, అవి.

రాత్రయేదాకా తోటలన్నీ తిరిగీ, అడివంతా తిరిగీ చివరకో ముళ్లపొద దగ్గిర కూచుని విచారిస్తూవుంది బుల్‌బుల్. ఆ ముళ్లపొద జాలిగా 'ఎందుకలా విచారిస్తున్నావ్ బుల్‌బుల్‌రాజా!' అని అడిగింది.

ఈ నెల బహుమతి పొందిన కథ — బొడ్డు ఉమేశ్‌బాబు - ఏలూరు

బహుమతిగా ఇతనికి ఒక చక్కని ఫౌంటెన్ కలము పంపబడుతున్నది.

'పూసే తీగలూ కాసే చెట్లే చెయ్యలేక పొయ్యాయ్. చిలిపి ముళ్ల పొదవు నువ్వు ఆరుస్తావా తీరుస్తావా' అంటూ బుల్‌బుల్ విచారిస్తూవుంది' 'అలా కాదు, చెప్పమంది ముళ్లపొద. బుల్‌బుల్ తన కథంతా చెప్ప సాగింది. అంతా విని ఆ ముళ్లపొద 'యీ మాత్రానికే ఇంత విచారించాలా?' అంది.

"ఇవ్వేళ పౌర్ణమి. యింతలో చంద మామ ఉదయిస్తాడు. అప్పట్నించీ నువ్వు నామీద కూచుని నా ముళ్లు నీకు గ్రుచ్చు కుంటున్నా లెక్క చెయ్యకుండా నీ గొంతులో వున్న కమ్మదనం అంతా ప్రోగుచేసుకొని సూర్యోదయం అయేవరకూ తెల్లవార్లూ కమ్మగా పాడుతూవుంటే చాలు. నువు కోరిన పువ్వు పూస్తా' నని అన్నది ముళ్ళ పొద. అందుకు వప్పుకుంది బుల్‌బుల్.

చందమామ వుదయించాడు. బుల్ బుల్ ఆ ముళ్లపొదమీద కూచుని అమృతం వర్షిస్తూ పాడుతూవుంది. ముళ్లన్నీ పట్టు కుచ్చులాంటి బుల్‌బుల్ శరీరాన్ని గ్రుచ్చి వేస్తున్నాయ్. రక్తం కారిపోతూ వుంది. అయినా బుల్‌బుల్ కమ్మగా, యింకా కమ్మగా పాడుతూనేవుంది.

ఆ పాటల్లో ముళ్లపొద కరిగిపోయి మొగ్గ వేసింది. వేసిన ప్రతి మొగ్గమీదా బుల్ బుల్ పిట్ట రక్తం చింది రంగు పూసింది. విరిసిన ప్రతి మొగ్గలోనూ వెన్నెలలోని చల్లదనం పాటల్లోని తియ్యదనం నిండి పోయాయి. తెల్లవారేటప్పటికి ముళ్ల పొదంతా పువ్వులు పూసివుంది.

ఎప్పుడూ చూడని ఆ క్రొత్త పువ్వును చూసి బుల్‌బుల్ చాల సంతోషిస్తూ ఒక పూలగుత్తి కోసుకుని తన నేస్తానికిచ్చింది. మాటప్రకారం బుల్‌బుల్ పడుచు పెళ్ళి చేసుకుని పిల్లాజెల్లాతో సుఖంగావుంది.

అప్పట్నించే బుల్‌బుల్‌పిట్ట రాత్రల్లా మేలుకుని పాడుతూవుంటుంది. ఆ ముళ్లే పొదే యిప్పుడు మనకు గులాబీఅయింది !!



# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

అడ్డము :

2. జగడము
4. కనికరము
5. లక్ష్యము
7. తండ్రి
8. ఒక సంవత్సరం
9. తాయెత్తు
11. వేప
12. మన్మథుడు




నిలువు :

1. ప్రక్క
2. ఒక యుగము
3. ఋషి
4. ఉత్సవము
6. సంగీతము
10. ఓర్పు
11. ప్రార్థించు
13. కృష్ణుని బావ

## చందమామలో కొత్త శీర్షిక



జూలై '51 నుండి 'చిట్టికథలు' అనే కొత్త శీర్షికను ప్రారంభించబోతున్నాము. ఈ శీర్షికయొక్క వివరాలు యివి:

★ చందమామ పాఠకులందరు ఈ పోటీలో పాల్గొనవచ్చు.

★ కథలు ఒక్క పేజికి మించకూడదు.

★ ఒక్కొక్కరు ఎన్నికథలైనా పంపవచ్చు

★ కథలు ప్రతినెలా 15-వ తేదిలోగా మాకు చేరాలి.

★ ఉత్తమమైన కథలకు రకరకాల బహుమతులుంటాయి.

★ బహుమతులు పొందిన వారిపేర్లు ఏనెల కానెల ప్రకటిస్తాము.

★ ఈ కథలు వీలువెంట చందమామలో ప్రచురింపబడుతై.



కథలు పంపవలసిన అడ్రెసు :

'చందమామ చిట్టికథల పోటీ'

పోస్టు బాక్సు 1686, మదరాసు - 1

# అట్టమీది బొమ్మ



దుష్టసంకల్పంతోవున్న రుక్మిని కృష్ణభగవానుడు పరాభవించిన సంగతి కిందటిసారి తెలుసుకున్నాం. ఆతరువాత రుక్మిణికీ, శ్రీకృష్ణునికీ శాస్త్రోక్తంగా వివాహం జరిగింది. తదుపరి కృష్ణుడు సంచారం బయల్దేరాడు. వెళ్లినచోటల్లా ఆయా రాజులు తమ తమ కుమార్తెలను పెళ్లాడుమని శ్రీకృష్ణుని బలవంత పెట్టసాగారు. వారిని కాదనలేక, ఆ రాజకుమార్తెలను కృష్ణుడు స్వీకరిస్తూ వచ్చాడు. అతను చేపట్టినవారిలో సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ—ఇలా ఎంతోమంది ఉన్నారు. ఈ అందరిలో నాగ్నజితి ఉదంతం చాలా చిత్రమైనది. ఈమె కోసలమహారాజైన నగ్నజితు కూతురు. ఆయన వరునికి ఒక పరీక్ష పెట్టాడు. తనవద్దనున్న భయంకరమైన ఏడు వృషభాలను ఎవడైతే లొంగదీయగలడో, అటువంటి వీరుడికి తన కూతురును ఇస్తానని ప్రకటించాడు. ఎందరెందరో శూరులూ, వీరులూ వచ్చారు. వృషభాలను చూచేసరికల్లా, తారెత్తి వారందరూ తోక ముడిచారు.

కొంతకాలానికి, సంచారంచేస్తూవున్న శ్రీకృష్ణుడు ఈ కోసలరాజ్యానికి రావడం తటస్థించింది. నగ్నజితు అతనిని ఎంతో అప్యాయంతో ఆదరించాడు. కృష్ణుణ్ణి చూసి అతడే తనకు పతి కావాలని నాగ్నజితి వాంఛించింది. అన్నట్టుగానే కోసలరాజు తన షరతును కృష్ణునికి తెలియజెప్పగా, కృష్ణుడు పరీక్షకు అంగీకరించాడు. భయంకరమైన ఆ వృషభాల ఎదుటికి వెళ్లేసరికల్లా అవి తోకలెత్తిపెట్టి, తమ వాడి కొమ్ములతో కృష్ణుడ్ని వాయువేగాన తరుముకు వచ్చినై. అప్పుడు కృష్ణభగవానుడు ఆ ఏడు వృషభాలకూ, ఏడు రూపులుగా ప్రత్యక్షమై, ఒక్కొక్కదానిని ఒక్కొక్కలిప్తలో లొంగదీసి, ముక్కుతాళ్లువేసి బంధించివేశాడు. కోసలరాజు ఆనందానికి మేరలేకపోయింది. తన తపము ఫలించినందుకు నాగ్నజితి ఉవ్విళ్లూరింది. కోసలరాజు అల్లుడికి గొప్పగొప్ప అరణాలిచ్చి అతి వైభవంగా పెళ్లిచేసి, అపురూపమైన అందాల రథంమీద అల్లుడినీ కూతురినీ ద్వారకకు సాగనంపాడు.

# తలుచుకొన్న అంకె చెప్పుకోవటం

నీ స్నేహితుడిని 63 లోపల ఏదైనా ఒక అంకె మనసులో తలుచుకోమను. అతను తలుచుకున్న అంకె ఈ క్రింది అంకెల వరుసలలో ఏయే వరుసలలో వున్నదో చెప్పమను. అతను తలుచుకున్న అంకె ఏదో నీవు యిట్టే చెప్పెయ్యవచ్చు. దీని కిటుకు 54-వ పేజీలో చూడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 4 | 8 | 16 | 32 |
| 3 | 3 | 5 | 9 | 17 | 33 |
| 5 | 6 | 6 | 10 | 18 | 34 |
| 7 | 7 | 7 | 11 | 19 | 35 |
| 9 | 10 | 12 | 12 | 20 | 36 |
| 11 | 11 | 13 | 13 | 21 | 37 |
| 13 | 14 | 14 | 14 | 22 | 38 |
| 15 | 15 | 15 | 15 | 23 | 39 |
| 17 | 18 | 20 | 24 | 24 | 40 |
| 19 | 19 | 21 | 25 | 25 | 41 |
| 21 | 22 | 22 | 26 | 26 | 42 |
| 23 | 23 | 23 | 27 | 27 | 43 |
| 25 | 26 | 28 | 28 | 28 | 44 |
| 27 | 27 | 29 | 29 | 29 | 45 |
| 29 | 30 | 30 | 30 | 30 | 46 |
| 31 | 31 | 31 | 31 | 31 | 47 |
| 33 | 34 | 36 | 40 | 48 | 48 |
| 35 | 35 | 37 | 41 | 49 | 49 |
| 37 | 38 | 38 | 42 | 50 | 50 |
| 39 | 39 | 39 | 43 | 51 | 51 |
| 41 | 42 | 44 | 44 | 52 | 52 |
| 43 | 43 | 45 | 45 | 53 | 53 |
| 45 | 46 | 46 | 46 | 54 | 54 |
| 47 | 47 | 47 | 47 | 55 | 55 |
| 49 | 50 | 52 | 56 | 56 | 56 |
| 51 | 51 | 53 | 57 | 57 | 57 |
| 53 | 54 | 54 | 58 | 58 | 58 |
| 55 | 55 | 55 | 59 | 59 | 59 |
| 57 | 58 | 60 | 60 | 60 | 60 |
| 59 | 59 | 61 | 61 | 61 | 61 |
| 61 | 62 | 62 | 62 | 62 | 62 |
| 63 | 63 | 63 | 63 | 63 | 63 |



# ఇంద్రజాలము

## హిందుస్తాన్ - పాకిస్తాన్

విజిటింగు కార్డు సైజువి ఇరవై తెల్లటి కార్డులు ప్రేక్షకులకు యిస్తాడు ఇంద్రజాలికుడు. ఈ కార్డులలో పదింటి మీద 'హిందుస్తాన్' అనీ, తక్కిన పదింటిమీదా 'పాకిస్తాన్' అనీ వ్రాసివుంటుంది. కార్డులతోపాటు యిరవై కవర్లుకూడా యిచ్చి. కార్డులను వాటిలో పెట్టమంటాడు. అప్పుడు ఇంద్రజాలికుడు తన కళ్లకు గంతలు కట్టమంటాడు. ఇలా కట్టిన తర్వాత ఆ యిరవై కవర్లను బాగా కలిపివెయ్యమని, వాటిలోంచి ఒకరిని ఒకకవరు తీసుకోమంటాడు. అలా తీసిన కవరులోవుండే కార్డుని తనకు యివ్వమంటాడు. అప్పుడు అది 'హిందుస్తాన్' కార్డో 'పాకిస్తాన్' కార్డో ఇంద్రజాలికుడు చెప్పివేస్తాడు.

కళ్లకు గట్టిగా గంతలు కట్టుకుని యిలా కోరిన కార్డును చెప్పకోవటం ఎలా సాధ్యం? 'సర్కారుకు ఎక్స్‌రే కళ్లు ఉన్నవి కనుక వాటిసహాయంతో ఈ ట్రిక్కు చెయ్యగలడు' అనుకుంటారు మీరు. కాని అది పట్టి భ్రమ. సర్కారు తన ఎక్స్‌రే కళ్ల సహాయంతో చేసే ట్రిక్కులు వేరే వున్నై. ఈ ట్రిక్కుకి మాత్రం ఒక్కటే కిటుకు వున్నది.




నీవు సభకి తెచ్చే యిరవై కార్డులూ ముందుగా యింటివద్దనే తయారు చేసి తెచ్చుకోవాలి. వాటిని ఎలా తయారు చెయ్యవలెనంటే: ముందుగా నలభై కార్డులు తీసుకో. వీటిలో యిరవై కార్డులు విడిగా వుంచి మిగతా యిరవై కార్డులనీ ఒక

కార్డు పైన మరొక కార్డు పెట్టి పది జంట కార్డులుగా అతికించు. ఈ పది కార్డుల పైనా 'పాకిస్తాన్' అని వ్రాయి. తక్కిన యిరవై కార్డులూ యిదేవిధంగా జంటకార్డులుగా చెయ్యాలి. అయితే ఈ సారి నీవు అంటించే ఈ కార్డులలో ఒక్కొక్కదాని మధ్య ఒక్కొక్క పాత బ్లేడు పెట్టి మరీ అంటించాలి. కార్డుకీ కార్డుకీ మధ్య బ్లేడు పెట్టినా మొదట తయారుచేసిన జంట కార్డులకీ వీటికీ ఏమా తమూ తేడా ఉండదు.



ఈ పది కార్డులపైనా 'హిందుస్తాన్' అని వ్రాయి.

తర్వాత - మంచి ఆకర్షణశక్తి కలిగిన మాగ్నెట్ (సూదంటురాయి) ఒకటి తీసుకొని దానిని నీ కోటు కాలరు అడుగున దాచి వుంచుకో.

ఇలా తయారై సభకి రావాలి.

ప్రేక్షకులకి కార్డులు యిచ్చాక వాళ్లు వాటిని కవర్లలోపెట్టి యిష్టంవచ్చినట్టుగా కలిపివేస్తారు. నీ కళ్లకు గట్టిగా గంతలు కట్టిన తర్వాత వాటిలో ఒక కార్డు తీసి నీ బల్లపైన వుంచుతారు. అప్పుడు నువ్వు ఆ కార్డును చేతితో తీసుకుని మాగ్నెట్ దాచి వుంచిన కోటు కాలరు దగ్గిరికి తీసుకువెళ్లి ఏదో ఆలోచిస్తున్నట్టు నటించు. లోపల బ్లేడు వున్న కార్డు అయినట్టయితే కార్డుని మాగ్నెట్ ఆకర్షిస్తుంది. బ్లేడువున్న కార్డు 'హిందుస్తాన్' కార్డు అని నీకు తెలియనే తెలుసు. కనుక 'ఇది హిందుస్తాన్ కార్డు' అని వెంటనే చెప్పివెయ్యవచ్చు. అలా ఆకర్షింపబడక పోయినట్టయితే 'ఇది పాకిస్తాన్ కార్డు' అనికూడా నీవు తడుముకోకుండా చెప్పివెయ్యవచ్చు.

ఇదే దీని రహస్యం.

---

పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదాహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరు రాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ప్రొఫెసరుగారి అడ్రసు యిది:

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్,
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19.

# "ఎందుకో తెలుసా?"



'బుల్‌బుల్ పిట్ట రాత్రంతా మేలుకొని పాడుతుంటుంది ఎందుకో తెలుసా?' అన్నదానినిగురించి మాకు వచ్చిన కథలలోకెల్లా ఉత్తమంగా వున్న కథను ఈ సంచికలో ప్రచురించాం. ఈ కథ పంపినది బొడ్డు ఉమేశ్‌బాబు - ఏలూరు. బహుమతిగా ఇతనికి ఒక చక్కని ఫౌంటెన్ కలము పంపబడుతున్నది.



'ఎందుకో-తెలుసా?' అనే శీర్షికను ఈ నెలతో నిలిపి వేస్తున్నాము. దీనికి బదులుగా జూలై '51 నుంచి ఒక కొత్త శీర్షికను ప్రారంభిస్తున్నాము. వివరాలకు 49-వ పేజీ చూడండి.

పజిలుకి జవాబు:




'ఈ బొమ్మకు రంగు వెయ్యండి' అనే శీర్షిక క్రింద యిప్పటివరకూ మీరు విడి విడి బొమ్మలకు రంగులు వేస్తూ వచ్చారు. కాని, ఈ నెలనుండి ఈ శీర్షిక క్రింద ఒక చక్కటి కథను ప్రారంభిస్తున్నాం. రంగు వెయ్యటానికి గాను ప్రక్క పేజీలో యివ్వబడిన బొమ్మ, ఆ కథకు సంబంధించినదే. మామూలు ప్రకారం ఈ బొమ్మకి రంగులు వేసి వుంచుకోండి. ఆ కథ ఎలా ప్రారంభింపబడుతుందో ఆ కథలో వచ్చే ఈ బొమ్మయొక్క వివరాలేమిటో వచ్చేనెల చందమామలో చూడండి.

## తలుచుకున్న అంకె చెప్పటం

నీ స్నేహితుడు ఏదో ఒక అంకె తలుచుకుంటాడు. ఆ అంకె ఫలానా ఫలానా వరుసలలో వున్నదని చెబుతాడు. అప్పుడు నీవు అతడు చెప్పిన వరుసలలో వుండే మొట్టమొదటి అంకెలను కలిపినట్టయితే అతను తలుచుకొన్న అంకె వస్తుంది. ఎలాగంటే—

నీ స్నేహితుడు 34 తలుచుకున్నాడనుకో. తను తలుచుకున్న ఈ అంకె 2, 6 వరుసలలో వున్నదని చెబుతాడు. ఈ రెండు వరుసలలో మొట్టమొదట వున్న అంకెలు 2, 32 కదా? ఈ రెండు సంఖ్యలనూ కూడితే అతను తలుచుకున్న 34 వస్తుంది.




రంగు వెయ్యండి (కథ) : 1-వ బొమ్మ

Controlling Editor - SRI CHAKRAPANI

Printed and Published by B. NAGI REDDI, at the B. N. K Press, Madras - 1



Chandamama, June '51 Photo by N. Bhaskaran

రాగానికి మేము, అందానికి మా అక్కలు

